# పరిత్యక్త

రచన

వేదుల లక్ష్మణమూర్తి



క్వాలిటీ పబ్లిషర్స్.
విజయవాడ 2.

# ప్రస్తావన

'సుకవితాయద్యస్తి రాజ్యేనకిం' అను సామెత, నాటి కాలంలో కవిత్వానికున్న ప్రాధాన్యతను సూచించుచున్నది. ప్రాచీన కాలంలో చక్రవర్తులు, రాజులు, రాజోద్యోగులు కవిత్వానికి, కళలకిచ్చిన ప్రాధాన్యత మరియొక దాని కిచ్చియుండలేదు. కవిత్వానికి రాజాదరణ, ప్రజాదణ ఎక్కువగా వుండెడిది. కవులకు, పండితులకు వారి ప్రతిభలనుబట్టి రాజుల ఆస్థానములలో గౌరవముండెడిది. వారి మంచిచెడ్డలు రాజులు స్వయంగా చూచెడివారు. మన దేశంలో చిన్న చిన్న రాజ్యములున్న రాజులు సహితం, కవులను పోషించారు. నేడు మనకున్న మహాగ్రంథాలన్నీ నాడు కవులకున్న రాజాదరణవల్లనే వెలువడినవి.

కానీ కాలం ఎల్లప్పుడూ ఓకే తీరుగా నుండదు. కాలముతోబాటు, రాజులు, రాజ్యాలు మారినవి. భరత దేశంలో, ఒకనాడు 'సుకవితాయద్యస్తి రాజ్యేనకిం' అన్న రోజుకు నేటికి పోలికలు లేవు. కాలం, రాజులు రాజ్యాలనే గాక, కవిత్వాన్ని, మనస్తత్వాల్ని మార్చింది. భావికాల వైపరీత్యం యింకా ఎట్లుండునో ?

సాంప్రదాయమైన కవిత్వంలో మార్పు విదేశీయులు, మన దేశమునకు వచ్చి స్థిరపడిన తరువాతనే వచ్చినది. నేడు మనకు ఆరాధ్యమై – ఎక్కువ పాఠకుల, రచయితల దృష్టి నాకర్షించినది నవల. నేడు తెలుగులో విరివిగా వెలువడుతున్న సాహిత్య ప్రక్రియల్లో, ఇది మొదటిది. తెలు

గులో తొలిగా నవలారచన, శ్రీ వీరేశలింగం పంతులు గారితో ప్రారంభమయినది. పద్య కవిత్వంలో వుండే తుష్టి, పుష్టి గాక, ఆయా సంఘటలను బట్టి వర్ణనలు పాత్రోచిత సంభాషణలు, ముగింపు, నిండుగా వుండి ఎల్లరూ చదువుటకు వీలుగా రచింప బడినవి. అయితే రానురాను, నేటి నవలలో అవే మృగ్యమైపోయి కేవలం, కథ చెప్పుటకే ప్రాధాన్యతే కలిగి వున్నవి.

శ్రీ వీరేశలింగం పంతులుగారి తరువాత తెలుగులో నవలా రచన మిక్కుటముగా చేసినవారు శ్రీ చిలకమర్తి వారు. ఆ తరువాత, తెలుగులో అనేకమంది అనేక నవలలు వెలువరించారు. అయితే, ఆ యా నవలలో వారుపయోగించిన భాషా, నవలల కుండవలసిన నిండుతనము లోపించడం వలన రానురాను వాటి ప్రాబల్యం తగ్గిపోయి కాలగర్భంలో కలిసిపోయినవి.

ఈ నవీన యుగములోగూడా తొట్టదొలుత వెలువడిన నవలలకు సమానంగా నవలా రచన మిక్కుటముగా చేసినవారు కారణజన్ములైన మహాకవి శ్రీవిశ్వనాథ శ్రీఅడివి బాపిరాజుగార్లు పాత ఒరవడిలో వ్రాసి, వారి రచనలకు, సార్వజనీనత, సార్వకాలీలత సిద్ధింప చేసుకొన్నారు.

అయితే, నాటికి, నేటికి దేశంలో మార్పులు కొల్లలుగా వచ్చినవి. నాడు కవులు, రాజాదరణవలన, వారి వంశ మూల పురుషుల చరిత్రలనో, పురాణ కథలతో తీసుకుని, వాటికి, తమ అసమాన ప్రజ్ఞను జోడించి, కావ్యలుగా ప్రబంధాలుగా వ్రాశారు.

అంతేకానీ, నాడువారికి నేటివలె, దేశ పరిస్థితులూ సమాజిక జీవితంలోని, మంచిచెడ్డలు, ఆర్థికయిబ్బందులు ఇవేవీ వారిదృష్టి నాకర్షింపలేదు; కానీ నేటిపరిస్థితి అదికాదు. ప్రాతఃకాలంలో బాలసూర్యుని లేత కిరణాలు, పృథివిమీద పడినప్పటినుండి, పశ్చిమాద్రిన సూర్యుడు అస్తమించు వరకు అనుభవించు కష్టాలు, బాధలు, ఆర్థిక చిక్కులు, అనేకానీకం, నేటి మనుష్యులు చవిచూడవలసి వచ్చింది. జానెడు పొట్టకోసం నేడు దేశంలో జరుగు అనేక అన్యాయాలు, అసత్యాలు, అమానుషప్రవర్తన మనం నిత్యం, చూస్తున్నాము. ఇవన్నీ చూచిన, నేటి కాలపు కవి రచయిత, విమర్శకుడు, దానికి పరిష్కార మార్గం ఆలోచించక వూరుకోరు.—ప్రాచీనసాంప్రదాయాల పేరిట నేటికీ సంఘంలో ముఖ్యంగా, సాంప్రదాయమైన కుటుంబాలలోజరుగుఅమానుషప్రవర్తన అన్యాయాలు, స్వయంగా జూచినపుడు, అనుభవించినపుడు, వాటికి ప్రత్యామ్నాయ పద్ధతులు ఆలోచించకుండా వుండనివారుండటం అరుదు.

ఈనవలాకర్త శ్రీ వేదుల లక్ష్మణమూర్తి, పైకోవకు చెందిన వ్యక్తి. ఆయన తన కండ్లయెదుట, అన్యాయాలు, అమానుషంగా ప్రవర్తించడంజరుగుచుంటే చూస్తూవూరుకోలేడు. అమంగళం ఆయన చూడడు. వాటి నివారణోపాయానికి ఆయన ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటాడు. ఆ ఆలోచనా ఫలితమే ఈ నవల.

సాంప్రదాయమైన కుటుంబాలలో, సనాతన సాంప్రదాయాల ప్రభావం, యింకా నేటికి, ఏవిధంగా వెర్రితలలు

వేసి, వున్నదీ వారుశుద్ధ ఛాందసులుగా తయారై, తమ వంశ ప్రతిపత్తి, పరువు, గౌరవం, అనే పదాలకు బానిసలై ఎదుట జీవి, జీవితం ఎలా వున్నదో తెలుసుకోలేని అమోమయ స్థితిలో వున్నారో కండ్లకు కట్టినట్లు చూపించడమే ఈ నవలా రచయిత, ప్రధానోద్దేశ్యం.

అందుకు ఒక సనాతన సాంప్రదాయ కుటుంబాన్ని తన రచనకు యితివృత్తంగా తీసుకొని భర్త ఒదిలిన ఒక హిందూ స్త్రీ (అందులో ముఖ్యంగా బ్రాహ్మణ స్త్రీజీవితం) ఎలా వుంటుందో, రచయిత మనకు చెప్పాడు. దానికితగిన పరిష్కారమార్గం చూపనపుడు, ఆ స్త్రీ జీవితం ఎలా పరిణమించేది. అతివాస్తవిక సంఘటనద్వారా తన ఈ నవలలో నిరూపిస్తాడు. ఇలాంటి అనేక సంఘటనలతో నిండిన ఈ నవల పాఠకుల అపార ఆదరాభిమానాలు చూరగొను ననుటలో సందేహంలేదు.

సంఘ పరిస్థితులను తీసుకొని, యిలాంటి ఉత్తమ రచనలు చేసినవారు చాలా అరుదు. అందుకే దీనికి తప్పక, సార్వజనీనత, సిద్ధించుననుటలో సందేహమూలేదు. ఇలాంటి ఉత్తమ రచనలు యింకా ఎన్నో వస్తేగాని నేడు మన మంటున్న సంఘజీవితం బాగుపడదు.

ఇట్లు

**శ్రీ కప్పగంతుల మురళీకృష్ణ.**

ఆమె ఏనాడో కన్నె చెరనుండి విముక్తి పొందింది. కాని గృహిణి కాలేదు. ఆమె కన్యగాని కన్య! విధవకాని విధవ!

కుటుంబ మర్యాదనూ, పూర్వ సాంప్రదాయాన్ని పాటించి తండ్రి ఆమెకు పదవయేడు దాటగానే వివాహం వైభవంగా చేశాడు.

వరుడు అన్నివిధాలా అనుకూలంగా ఉన్నాడని ఆ వివాహానికి వచ్చిన వారంతా ప్రశంసించారు. వధూవరుల నాశీర్వదించారు.

వధువు తండ్రి, శంకర శాస్త్రిగారు, తల్లి లక్ష్మీదేవమ్మగారు. తమ జీవితంలో ఒక మహాత్కార్యం చేశామని గర్వించారు. "కార్యకరాదులు చేశారంటే ఎంత దూరాలోచన, నేర్పరితనం, ఓరిమి కావాలి? అందరిచేత భేష్ అనిపించుకోడం మాటలా? పాపం, ఆ కృష్ణారావు చూడు; ఏడెనిమిదివేల దాకా డబ్బు ఖర్చయింది, మాటా దక్కలేదు. వానరులు లంకలో చేసినట్లు ఆ పెళ్ళివారు నానా రసాభాసా చేసి పోయారు. పాపం. అతను ఇప్పటికికూడా తలెత్తుకొని తిరగలేక పోతున్నాడు. ఇంతకూ ఆ అల్లుడి అన్నదమ్ములంతా పంచుకొంటే ఒకొక్కడికి ఎకరం భూమికూడా రాదట. పోనీ, మహా చదువుకొన్నవాడా

అంటే అదీ లేదు. స్కూల్ ఫైనల్ పరీక్ష తప్పాడట" అని శంకరశాస్త్రిగారు కుమార్తె వివాహం చేసిన తర్వాత ఒక నాడు భార్యతో అన్నాడు.

"అవునుగానీ, మన అల్లుడికి ఇరవై యకరాల భూమి పూర్తిగా ఉన్నట్టేనా ?" అంది భార్య.

"అదేమిటేవ్ ? ఇంకా సందేహమా ? ఆ భూము లకు సంబంధించిన దస్తావేజులుకూడా చూశాను నేను. వాని కేమే, జమీందారు బిడ్డలాటివాడు ! పదహారేళ్ళ వయ స్సులో ఇప్పుడు ఫిఫ్త్‌ఫారం చదువుతున్నాడంటే ఎంత తెలి వైనవాడో ఊహించు ! ఇంక నాలుగైదేళ్ళకి బి. యే. ప్యాసై కూర్చుంటాడు. అప్పటికి మన అమ్మాయీ పెద్ద దౌతుంది" అని అల్లుని ఉజ్వల భవిష్యత్తునుకూడా చెప్పి వేశాడు శంకరశాస్త్రిగారు.

అల్లుని ఐశ్వర్యం, చదువూ, తెలివీ, రూపమూ తలచుకొని లక్ష్మీదేవమ్మగారు సంతోషంతో పొంగిపోయింది. "మా చిట్టితల్లికి దేవేంద్రుడిలాంటి మొగుడు దొరికాడు" అంటూ వాకిట్లో ఆడుకొంటూ ఉన్న కొత్తపెళ్ళికూతురు, సరస్వతి దగ్గరకి వెళ్ళి ముద్దాడింది లక్ష్మీదేవమ్మగారు.

## 2

శంకరశాస్త్రిగారికి అల్లుడైన రంగారావు చిన్నతనం లోనే తండ్రిని కోల్పోయాడు. తల్లి శారదాంబ వానిని అల్లారుముద్దుగా పెంచుతోంది.

భర్తలేని కారణంగా రంగారావే తల్లికి జీవిత సర్వస్వమయాడు. అత డాడింది ఆట, పాడింది పాటగా సాగిపోతోంది. ఇరవై ఎకరాల భూమిమీద వచ్చే రాబడితో గారాబంగా పెరిగే రంగారావుకి ఏ విషయంలోనూ లోటులేదు.

పెళ్ళి కానంతవరకూ వాని అల్లరి, పెంకితనము, చెడు ప్రవర్తన చిన్నతనపు చేష్టలుగా పరిగణించబడ్డాయి. కాని ఇప్పుడు వాని ప్రవర్తనకు తల్లి దిగులుపడుతోంది. రంగారావు తానుచేసే పనులను నిర్భయంగానూ, పెద్దమనిషి తరహాగాను చేయ నారంభించాడు. కాఫీహోటలు, సినీమా, సిగరెట్లు మొదలైనవాటి ఖర్చులు పెరిగాయి. స్నేహితుల ప్రశంసలు పొందడానికై వారికి తక్కువ మొత్తములలో అప్పు లిస్తూంటాడు. సినీమా, కాఫీహోటలు ఖర్చులు వారివికూడా తానే భరించి గర్విస్తూంటాడు. ఒకనాడొక స్నేహితుడు వానిని ఒక రూపాయి అప్పు అడిగాడు. లేదని, చెప్పడానికి చిన్నతన మనిపించింది రంగారావుకి. మా అమ్మ నడిగి సాయంకాలము ఇస్తానని వానితో చెప్పాడు. అప్పుడా స్నేహితుడు నవ్వాడు. ఏం నవ్వుతా వేమని అడిగాడు రంగారావు. 'అబ్బే ఏమీలేదులే ఎద్దులా ఎదిగిన తర్వాత కూడా సొదరుడబ్బులు అమ్మ నడగడానికి నీకు సిగ్గుగా ఉండదు ?' అన్నాడు స్నేహితుడు. రంగారావుకి ఈ విషయం నిజమే ననిపించింది. స్నేహితుని మాటకు వాని హృదయం బాధపడింది. చాలా సిగ్గు పడ్డాడు కూడాను. 'ఏం జేస్తాంరా. ఇంకా మనచేతిలోకి రాలేదు పెత్తనం' అన్నాడు విచారంగా..

'నీ ఆస్తికీ, నీ యింటికీ, పెత్తనం ఇంకోళ్ళు ధార పోస్తారుట్రా, నువ్వు కల్పించుకొని అధికారం నీ చేతుల్లోకి తెచ్చుకోవాలిగాని?' అన్నాడు స్నేహితుడు.

ఈ సంఘటనతో రంగారావులో విప్లవ భావాలు బయలుదేరసాగాయి. తాను పెద్దవాడైనట్లు భావించాడు. తనకు పైన అమ్మ ఉన్నదని, ఇంటికి యజమానియని, తాను ఆమె చెప్పు చేతుల్లో మెలగవలసినవాడనని ఇదివరలో భావించేవాడు. కాని ఇప్పుడు ఆ తలపులు ఒకొక్కటిగా తారుమారు కాసాగాయి. తనకు పెళ్ళి అయినది. తాను తాళి గట్టిన పిల్ల కొంతకాలానికి తన యింటికి వస్తుంది. తాను ఇంటికి యజమానియై వ్యవహారములన్నీ చక్కబరచు కోవాలి. తను తల్లికి భయపడటమేమిటి? తన ఆస్థి; దాని మీద వచ్చే రాబడి, ఇంటిఖర్చులు మొదలైన విషయాలన్నీ తానే చూచుకోవాలి. చీటికీ మాటికీ అమ్మను అర్ధ రూపాయి అడగడం అవమానకరమైన విషయం అను కొన్నాడు రంగారావు.

ఆనాటినుండి తన ఆస్థికి సంబంధించిన వివరాలు తల్లి నడిగి తెలుసుకొన నారంభించాడు. ఏ పొలంమీద ఎం తెంత మక్తా వస్తుందీ. ఏ యే రైతులు తన చేలు వ్యవ సాయం చేస్తున్నారు మొదలైన వివరాలు తెలుసుకున్నాడు. తల్లి దగ్గర బంగారు నగ లున్నట్లు వాని కిదివరకే తెలుసు. ఆమెదగ్గర కొంత డబ్బు నల్వ ఉందనికూడ వాని ఊహ. బంగారమూ, డబ్బూ గదిలోని కట్టెపెట్టెలో జాగ్రత్త చేసిం దనికూడ వానికి తెలుసు. ఇంతవరకూ రూపాయిలోపుగా

చిల్లర డబ్బులు అతను అడిగినప్పుడల్లా తల్లి ఇస్తూనే ఉంది. అంతకు మించి ఐదులు, పదులు అడిగితే ఎందుకని అడుగు తుంది. అవసరంలేకపోయినా, ఏవో వస్తువులు కావాలని స్కూలు ఫీజులు చెల్లించాలని అప్పు డప్పుడు రెండేసి, మూడేసి రూపాయలు అతను తీసికొనిపోయే వాడుక ఉంది. వాని ఒక్కని ఖర్చే అయినట్లయితే ఆ డబ్బు స్వేచ్ఛగా సరిపోయేది కాని, స్నేహితులకుకూడ పెట్టుబడి పెట్టడం ప్రారంభించాక వానికి డబ్బు చాలడంలేదు. రోజురోజూ అబద్ధమాడవలసిన స్థితి ఏర్పడింది. రెండు మూడు విష యాల్లో తల్లికి అనుమానంకలిగి వారి పొరుగువారి పిల్ల వాడు. రామాన్ని వీని పుస్తకాల ఖర్చును గురించి, స్కూలు ఫీజునుగురించి ఆరాతీసి అడిగింది. రంగారావు చెప్పినవన్నీ అసత్యములని తెలుసుకుంది. వాని స్వేచ్ఛా ప్రవర్తనను గురించికూడ ఆమెకు తెలిసింది. దానితో వాని మాటల మీద ఆమెకు నమ్మకం పోయింది. వానికి అనేక విధాల నచ్చచెప్పింది—'ఇలా దుబారాఖర్చులు చేసుకొంటే ఎంతటి ఆస్తిఅయినా నిలువదు నాయనా! నీ మేలుకే చెబు తున్నాను. మంచి స్నేహంచేసి శ్రద్ధగా చదువుకొని కీర్తి ప్రతిష్ఠలు సంపాదించుకోవాలి బాబూ!' అని.

తల్లిమాటలు వాని చెవి కెక్కలేదు. పైగా తాను బుద్ధిగానే ఉంటున్నానని మరికొన్ని అబద్ధాలాడి తల్లిని నమ్మించడానికి ప్రయత్నించాడు. 'నేను దుబారా ఖర్చు చేస్తున్నానని చెప్పిన వెధవెవడు? ఇలా పిలు!' అని దబాయించాడు.

# 3

భర్త అంటే ఏమిటో అర్థంకాని వయస్సులో సరస్వతికి పెళ్ళయింది. సరస్వతికి సహజంగా లజ్జా స్వభావం కలది. పెళ్ళికిముందు, సరస్వతికి కాబోయే వరుని గురించి, ఆమె తల్లీ, తండ్రీ మాట్లాడుకొంటున్నారు. సరస్వతికి ఆ మాటలు తన పెళ్ళిని గురించే అని మాత్రం తెలుసు. ఆమె అప్పుడు తనతోటి పిల్లలతో బొమ్మలపెళ్ళి ఆట ఆడేది. అలాగే తనకు ఒక అబ్బాయితో పెళ్ళి చేస్తారని అనుకొంది సరస్వతి. తల్లి దగ్గరకు వచ్చి "అమ్మా ! నా మొగుడు ఎలా ఉంటాడే ? నల్లగావుంటే నేను చేసుకోనేవ్ !" అంది. ఆ మాటలకి తల్లీ, తండ్రీ నవ్వుకొన్నారు.

"ఇది బొమ్మలపెళ్ళి కాదమ్మా ! నీకు నిజంగా పెళ్ళవుతుంది. నీ మొగుడు మన్మథుడిలా ఉంటాడు. మొగుణ్ణి గురించి అలా మాట్లాడకూడదమ్మా ! తప్పు ! మొగుడంటే సిగ్గుతోనూ, భయంతోనూ ఉండాలి ! మొగుడిదగ్గర ఉన్నప్పుడు తల వంచుకొని అణకువగా ఉండాలి ! మొగుడితోగాని, పెద్దవాళ్ళతోగాని మాట్లాడకూడదు !" అని చెప్పింది తల్లి.

నిజంగా తనకు జరగబోయే పెళ్ళిని గురించి, కాబోయే భర్తను గురించి తల్లి చెప్పిన మాటలు సరస్వతి మనస్సుకి బాగా నాటాయి. తన పెత్తండ్రిగారి అమ్మాయి, కాంతక్కకి పెళ్ళి ఎలా జరిగిందో అలాగే తనకు కూడా జరుగుతుందని అనుకొంది సరస్వతి.

పెళ్ళిలో సరస్వతి తన మొగుణ్ణి చూడనేలేదు. తల వాల్చుకొని, ముడిచిపెట్టుకొని కూర్చొని తల్లి ఉపదేశాన్ని పాటించింది.

ఆతర్వాతకూడ ఎప్పుడైనా సరస్వతి మొగుణ్ణి గురించి ఎవరైనా ప్రసంగిస్తే అక్కడనుంచి పారిపోయేది. పెళ్ళయిన తర్వాత సంక్రాంతి, సంవత్సరాది, దసరా మొదలైన పండుగలకు శంకరశాస్త్రిగారు అల్లుని తీసుకొని వచ్చారు. అప్పుడుకూడ సరస్వతి తన మగని కంటబడకుండాను, మగనిని తాను ప్రత్యక్షంగా చూడకుండాను కాలక్షేపం చేసింది.

## 4

సరస్వతికి పెళ్ళయిన తర్వాత రెండు సంవత్సరాలు గతించాయి. సరస్వతి తల్లి దండ్రులకు అల్లుని ప్రవర్తనను గురించిన వార్తలు రకరకాలుగా చేరుతున్నాయి. ఎప్పటి కప్పుడే తమ అల్లుడు ఇంకా చిన్నవాడనీ బాల్యంలో ఆమాత్రం అల్లరి చిల్లర పనులు ప్రతి పిల్లవాడూ చేస్తాడని సరిపుచ్చుకొంటూ వచ్చారు. కానీ పెళ్ళయిన తర్వాత ఈ రెండేళ్ళలోనూ కూడా అల్లుడు పైతరగతికి వెళ్ళకపోయిన విషయం మాత్రం వారిని నిరుత్సాహ పరిచింది. అల్లుని గురించి వారిలో కలిగిన మంచి మంచి వూహాలన్నీ ఒకొక్కటిగా మాయమవుతూ వచ్చాయి.

పెళ్ళయిన మూడవయేట సంక్రాంతి పండుగకు వచ్చినప్పుడు శంకరశాస్త్రిగారు అల్లునికి మృదువుగా చివాట్లు

పెట్టారు—"రంగారావూ, నీ వింకా చిన్నవాడవు. లోకం లోని కష్టసుఖాలు అర్థంకాని వయస్సులో ఉన్నావు. మా వంటి పెద్దవాళ్ళం చెప్పిన మాటలమీద లక్ష్యముంచి కొంచెం అదుపాజ్ఞల్లో ఉండడం అలవాటు చేసుకొంటే నీ భవిష్యత్తు ఎంతో బాగుంటుంది. నువ్వు ఈపాటికి నీ బాధ్యతలను గుర్తించాలి. నువ్వు తగినంత ఆస్తిపాస్తులు గల వాడవు. కల్లబొల్లి మాటలుచెప్పి, ఏదో విధంగా నిన్ను మంచిచేసుకొని నీవద్ద పదిరాళ్లు గుంజుకొందామని చూస్తూ వుంటారు చాలామంది. ఎవరితోపడితే వారితో స్నేహంచేసి తప్పుదోవల పడితే ముందు పశ్చాత్తాపపడవలసి వస్తుంది. నీకీ ఆస్తి వున్నంతకాలమే ఈ స్నేహితులందరు నీ చుట్టూ తిరుగుతారు. నీచేత రక రకాలుగా డబ్బు ఖర్చుచేయిస్తారు. ఖర్చు చేయడానికి కానీకూడా లేనిస్థితి వచ్చిందంటే ఒక్క స్నేహితుడుకూడా కనుపించడు"

"ఒక్క విషయం చూడు—ఇప్పుడు నువ్వు ఫిఫ్త్ ఫారం మూడోయేడు చదువుతున్నావు. తగినంత తెలివి తేటలు కలిగివుండికూడా రెండేళ్ళు పరీక్ష పోయిందంటే కారణం యేమిటో ఊహించుకో. చదువూలేక సంపదాలేక ఎంతమంది ఏవిధంగా అష్టకష్టాలు పడుతున్నారో చూడు. నీ క్షేమం కోరేవాళ్ళం గనుక ఇన్ని విధాల చెబుతున్నాం. చెడు స్నేహాలు మాని జాగ్రత్తగా చదువుకొని అభివృద్ధిలోకివస్తే చూచి ఆనందిస్తాం నాయనా!"

మామగారిచ్చిన ఉపదేశం మౌనంగా విన్నాడు రంగారావు. తాను సంపదగలవాడనే గర్వం ఏనాటి

నుండియో రంగారావు మనస్సులో వానికి తెలియకుండానే ఉంది. మామగారికి ఏ. బీ. సీ. డీ లైనా రావని, ఏదో కొద్దిగా స్మార్తం నేర్చుకొన్న ముక్కుపొడుం శాస్త్రిలు గారని పెళ్ళిఅయిన కొత్తలోనే ఊహించుకొన్నాడు. హైస్కూల్లో చదువుతూన్న తను మామగారికంటే ఎక్కువ విద్యావంతుడనే ఊహ ఇప్పుడు వాని మనస్సుకు తట్టింది. పిల్లనిచ్చినవాడు ఎంత గొప్పవాడైనా అల్లుని అడుగులికి మడుగు లొత్తుచూ ఉండాలనే సిద్ధాంతం వానికి ఇంతకు ముందే తెలుసు. అందుచేత మామగారి మాటలవల్ల వాని అహంభావం తలెత్తింది. 'ఈయన నాకు మంచి చెడ్డలు బోధించేవాడు ? అనుకొన్నాడు. మనస్సులో అనుకొన్న మాట పైకి అనడానికి తగిన సాహసం వానికి కలుగలేదు' ఎవళ్ళో ఏ.కో చెప్పగా మీరు విన్నారు. వారి మాటలన్నీ నమ్మారు. అవన్నీ అబద్ధాలేనండీ!' అన్నాడు కొంచెం నిర్లక్ష్యంగా.

'ఐతే చాలా సంతోషం. నీ ప్రవర్తన సరిగాఉంటే ఏబాధా లేదు. ఈ యేడైనా పరీక్ష తప్పకుండా శ్రద్ధ వహించు నాయనా !'

'రెండేళ్లు పరీక్ష పోయిందంటే అదంతా నా లోపమే అనుకొంటున్నారు కాబోలు! దానికి వేరేకారణముందిలెండి"

"వేరే కారణ మే ముంటుంది ?"

"మాకు ఇంగ్లీషు చెప్పే మాస్టరుకి నామీద కోప మండీ! అందుచేత పేపరు బాగా వ్రాసినప్పటికీ మార్కులు వెయ్యకుండా ఫేలు చేస్తున్నాడాయన."

"అదేమిటోయ్, అంత దారుణ ముంటుందా? ఏనా ఆయన పెద్దవాడు. చదువుకొన్నవాడు. పైగా మీకు ఉపాధ్యాయుడు ఆయనయందు వినయ విధేయతలు కలిగి ఉంటే నీమీద ఆయనకి కోప మెందుకు వస్తుందీ?"

"మీరు పూర్వకాలపు మనుషులు. ఇప్పటి హైస్కూళ్ళ చదువుల సంగతి మీకు తెలియదులెండి!" అన్నాడు రంగారావు ఆరిందాలా.

ఇలా పెద్ద కబుర్లు చెప్పే పిల్లవానితో ప్రసంగించి లాభం లేదనుకున్నాడు శంకరశాస్త్రిగారు. వాని మాటల తీరు, తనయందు అతను చూపించే నిర్లక్ష్యభావం చూచి శంకరశాస్త్రిగారికి కోపం వచ్చింది. కాని అల్లునితో ఏమైనా కఠినంగా మాట్లాడితే వానికి కోపం వస్తుందేమోనని సందేహించి మరి మాట్లాడలేదు.

ఆ సంక్రాంతిపండుగ వెళ్ళినతర్వాత మరెన్నడూ రంగారావు అత్తవారింటికి వెళ్ళలేదు. ప్రతిపండుగకు శంకర శాస్త్రిగారు అల్లునివద్దకు వెళ్ళడం, రమ్మని పరి పరి విధాల ప్రబతిమాలడం జరిగింది. కాని ఏవేవో సాకులు చెప్పి రంగారావు అత్తవారింటికి వెళ్ళడం పూర్తిగామాని వేశాడు. ఈవిధంగా మరి రెండు సంవత్సరాలు గడిచిపోయాయి. రంగారావు ప్రవర్తన ఆనాటి కానాడు చెడుతూనే ఉంది. చదువుకి పూర్తిగా స్వస్తి జెప్పాడు. ఇప్పుడు వాని ఖర్చులు వందలమీద ఉన్నాయి. తల్లి జాగ్రత్తచేసిన రెండువేల రూపాయలు, ఆమె నగలు ఆమెకు తెలియకుండా తీసుకొని పోయాడు రంగారావు. పేకాడడం, స్నేహితులతో విచ్చల

విడిగా తిరగడం బాగా అలవాటైంది. వానిని గురించిన చింత అటు తల్లికీ ఇటు అత్తమామలకి నానాటికి పెరుగుతోంది.

# 5

రంగారావు స్వగ్రామమైన రామచంద్రపురంలో బజారువీధికి ప్రక్కనున్న వీధిలో కిల్లీ దుకాణ మొకటుంది. దుకాణదారుని పేరు ముత్తయ్య. వాని వయస్సు ఏభైకి పైబడింది. వానికి కమలం అనే పెంపుడు కూతురుంది. కమలం పదహారేళ్ళ బాలకుమార్తె. వన్నెచిన్నెలుకల కన్నెపిల్ల. ముద్దులొలికేటట్టు మాట్లాడుతుంది. అందరినీ కవ్విస్తుంది; నవ్విస్తుంది; ఆకర్షిస్తుంది: ఉర్రూత లూగిస్తుంది. ఆమెతో మాట్లాడిన ప్రతివాడూ కమలం తనదే అనుకొనేటట్లు ప్రవర్తిస్తుంది. కాని అంతపరకే. ఆమెను ఆశించిన వాడు చెయ్యిజాపితే ఆమె అందని ద్రాక్షపండై పోతుంది. ఇంతవరకూ ఆమె ఎవనికీ తన మనసు మాత్రం ఇవ్వలేదు. ఎవనినీ ప్రేమించలేదు.

ముత్తయ్య కమలాన్ని ఎంతో జాగ్రత్తగా పెంచాడు. ఆమెమీద ఎన్నో ఆశలు పెట్టుకొన్నాడు. 'నా ముద్దుల బిడ్డ కమలం విద్యావంతురాలు కావాలి; నృత్యగానాల్లో ప్రవీణురాలు కావాలి; దీని ద్వారా నా పేరు పైకిరావాలి. నేను ఐశ్వర్యవంతుడనై సకల విద్యాప్రవీణురాలైన నా

బిడ్డను చూచుకొంటూ హాయిగా 'కన్ను ముయ్యాలి' అని తలచేవాడు. అందుకు తన యావచ్ఛక్తినీ వినియోగించాడు. చదువు చెప్పించాడు; సంగీతం చెప్పించాడు. నృత్యానికి మాత్రం ఆవూళ్ళో గురువు దొరకలేదు. కమలం బుద్ధి చాలా సునిశితమైనది. మిడిల్‌స్కూల్ చదువు పూర్తి చేసింది. తనకు చెప్పే గురువుగారి సంగీతవిద్యను అంతా నేర్చుకొంది. గురువుగారికంటే బాగా ఫిడలు వాయిస్తుంది. ఇంకా చదివించి కమలాన్ని సంగీతంలో పండితురాలినిగా చెయ్యాలని ముత్తయ్య ఆకాంక్ష, కానీ డబ్బుతోగాని అవి సాధ్యపడవు. ముత్తయ్యకు ఆమె కింక విద్య చెప్పించే సమర్థత లేకపోయింది. శరీరంలో ఓపిక సన్నగిలింది. సంపాదించడానికి కిళ్ళీకొట్టు తప్ప మరే సాధనంలేదు. దానివల్ల వచ్చే రాబడి చాలా తక్కువ. రోజులు గడవడమే చాలా కష్టంగా ఉంటుంది. కమలం వయస్కురాలయింది. 'ఇంక దీన్ని కులవృత్తిలోకి దింపితేనేగాని రోజులు గడువవు; ఒక పూట తిని, ఒకపూట తినక ఇంకా ఎన్నాళ్ళని కాలక్షేపం చెయ్యడం ? అనుకొన్నాడు ముత్తయ్య. కమలానికి కొన్నాళ్లు వృత్తిలోని రహస్యాలు ఉపదేశించాడు. కమలాని కవన్నీ వింతగా తోచాయి. మొదట్లో ఆ వృత్తి చెయ్యనన్నది. కాని సంపాదించడానికి కడుపు నింపుకోడానికి మార్గాంతరంలేక ముత్తయ్య మాటలకి తల ఊపింది కమలం.

కమలానికి పదిరూకలు చేరే ఏర్పాటుచేస్తూ తన రోజులు హాయిగా గడిపేస్తున్నాడు ముత్తయ్య.

ప్రస్తుతం రంగారావు కమలం చుట్టూ భ్రమరంలా తిరుగుతున్నాడు. కమలం రంగారావును చూచింది. ఇంత వరకూ ఎవనినీ ప్రేమించని కమలం వానిని చూడగానే పర వశ ఐపోయింది. వానిముందు కృత్రిమంగా ప్రవర్తించలేక పోయింది. ఇంతవరకూ ముకుళించుకొని ఎవనికీ తనలో స్థాన మివ్వని ఆమె హృదయకమలం రంగా దర్శనంతో విక సించింది, రంగా వెంటనే ఆమె హృదయకుహరంలో బైఠా యించాడు.

రంగారావు తల్లి నగలన్నీ రూపాంతరంపొంది రవ్వల తోనూ, రాళ్ళతోనూ కమలానికి కాంతి నివ్వసాగాయి. ముత్తయ్య కిల్లీకొట్టుకి చేరిఉన్న గదిలో తరచూ పేకాట సాగుతోంది.

# 6

సరస్వతి యుక్తవయస్సు రాలయింది. పునస్సంధానం చేసి పిల్లను అల్లుని దగ్గరకు పంపిస్తే అల్లుడు బాగుపడతా డని ఊహించాడు శంకరశాస్త్రిగారు. ఈ విషయం ఆయన అల్లునికి తెలియజేశాడు. కాని అతను ఇప్పుడా మాట తల పెట్టవద్దని ప్రత్యుత్తర మిచ్చాడు.

మాసాలు గడిచిపోతున్నాయి. శంకరశాస్త్రిగారు స్వయంగా అల్లుని కలుసుకొని మళ్ళీ పునస్సంధాన ప్రస్తావన తెచ్చాడు. ఇంకా ఇప్పుడుకాదు అనిమాత్రం చెప్పి ఆయన ముందునుంచి వెళ్ళిపోయాడు రంగారావు.

తల్లి శారదాంబ 'ఏం చెయ్యను అన్నగారూ, ఇలా ఉంది వీడి వరుస. ఇంటిపట్టున ఉండడంకూడా మానివేశాడు! ఏదో వేళకు వచ్చి తిండిమాత్రం తిని పోతుంటాడు. ఆడదాన్ని, వీని కేమని చెప్పి నచ్చజెప్పగలము?' అని కంట నీరు పెట్టుకుంది.

శంకరశాస్త్రిగారు దీర్ఘంగా నిట్టూర్చాడు. ఏమి చెయ్యడానికి ఆయనకు పాలుపోలేదు. కొంతసేపు ఇద్దరూ మౌనంగా ఉన్నతర్వాత శారదాంబ—'మా అన్నయ్య రాజమండ్రిలో ఉన్నాడు. వానికి వెంటనే రమ్మని ఉత్తరం వ్రాశాను. వాడు చెప్తే ఏమైనా తల కెక్కుతుందేమోనని నా ఆశ' అని చెప్పింది.



రంగారావు మేనమామ, గోవిందరావుగారు హైస్కూల్లో ఉపాధ్యాయుడు; లోకానుభవం కలిగిన వ్యక్తి, మంచి చతురుడు. కవి కూడాను. ఆయన తన చెల్లెలు వ్రాసిన ఉత్తరం చూచుకొని వెంటనే బయలుదేరి రాను చంద్రపురం వచ్చాడు. వచ్చిన కొద్దిగంటలలో మేనల్లుని ప్రవర్తన అర్థం చేసుకొన్నాడు. రెండురోజులు రంగారావుతో కలసి మెలసి ప్రవర్తించాడు. ఇంట్లో పేకాట కాలక్షేపం పెట్టాడు. సినిమాకు వెళ్ళాడు. కావ్యాల్లోని స్త్రీలనుగురించి వారి సౌందర్యాలనుగురించి కమ్మగా కబుర్లు చెప్పాడు. యువతీ యువకుల ప్రేమ కలాపాలు మధుర మధురంగా వినిపింప జేశాడు. రంగారావు భార్య, సరస్వతీని ఈమధ్య తాను చూడకపోయినప్పటికినీ చూచినట్లు చెప్పాడు.

ఆ పిల్ల ఇంకా పుట్టింట అలా పడిఉండడాన్ని గురించి తన విచారాన్ని తెలియజేశాడు. 'వికసించె, పరిమళాన్ని పరివ్యాప్తంచేసే పుష్పాన్ని యువకుడవై యుండి అనాఘ్రాతంగా వదలివేశావంటే నీలో రసికత్వం లేదనుకుంటుంది. లోకం. అందిన ఫలాన్ని అనుభవించడం వివేకవంతుని లక్షణం. 'అని రకరకాలుగా వానికి బోధచేశాడు. వాని మనస్సుకి సరిపడేలా మాట్లాడాడు. వాని యువక హృదయాన్ని అతి నేర్పరితనంతో ఉద్రిక్త పరచాడు. రంగారావు మంత్ర ముగ్ధ భుజంగంలా నేనమామకు లొంగిపోయాడు. పునస్సంధానం చేసుకొని భార్యను తనదగ్గరకు తెచ్చుకోడానికి అంగీకరించాడు.

# 7

మొదటిరాత్రి గదిలో ఒంటరిగా రంగారావు తన భార్యను చూచాడు. లజ్జాభరంతో తల వంచుకొని, భయంతో శరీరాన్ని ముడుచుకొని, ఒక మూల నిలబడింది సరస్వతి నూతన యవ్వనంతో ఏవేవో మధురానుభూతులకై ఊటకలు వేసే హృదయంలో ఈ మొదటిరాత్రి గదిలో తా నేమి చెయ్యాలో భర్తతో ఏమి మాట్లాడాలో ఇంతకు ముందు ఊహించుకొంది సరస్వతి. కాని గదిలో అడుగు పెట్టగానే ఆమె గుండె దడదడ లాడింది. కాళ్ళూ చేతులూ కంపించాయి. శరీరం చెమటతో తడిసిపోయింది. తలయెత్తి తన భర్త ఎలా ఉంటాడో చూడ్డానికికూడా ఆమెకు ధైర్యం చాలలేదు.

గోవిందరావుగారు సరస్వతి రూపమునూ యవ్వనమునూ వర్ణించినప్పుడు ఆమె నొక అపర వరూధినిగా భావించి ఆమె కమలంకంటె మిన్నగా తన్ను ప్రణయానంద డోలికలలో ఊగిస్తుందని తలచాడు రంగారావు. గదిలో ప్రవేశించగానే ఆమె తనను ఆహ్వానించడానికి ఏ యే హావభావాలను ప్రదర్శిస్తుందో, కదలీ కదలని పల్లవాధరములతో మాటల మధువును ఎలా ఒలికిస్తుందో, మృదుల కరస్పర్శలతో తన శరీరమును ఎలా పులకరింపజేస్తుందో ఊహించుకొని ఉవ్విళ్లూరాడు. కాని ఇప్పుడామెలో తానుతల్చుకొన్నవాటిలో ఏ లక్షణమూ లేదు. నిర్జీవ శిలాప్రతిమలా నిలబడి ఉంది సరస్వతి. ఆమె వస్తుంది, ఏదో మాట్లాడుతుంది, ఏవేవో చిలిపిచేష్టలు చేస్తుందని తలచుకొంటూ మంచం మీద కూర్చున్నాడు రంగారావు. ఒక్కొక్క నిమిషం చొప్పున ముప్పై నిమిషాలకాలం గడచిపోయింది. వానికి విసుగు జనించింది. 'కమలనే అయితే ఇంతసేపు అలా బొమ్మలా నిలబడుతుందా ? ఎన్ని మాటలు మాట్లాడేది ! ఎన్ని రకాలుగా తనను కవ్వించేది ! నవ్వించేది ! ఆడించేది ! ఆమె మాటలకు చేష్టలకు తాను పరవశుడై పోయేవాడే!' అనుకొన్నాడు రంగారావు.

కాగుతూన్న పాలవలె వానిలో యవ్వనం పొంగుతోంది. వాని హృదయం తహతహలాడుతోంది. అతను ఒంటరిగా గదిలో ఒక యువతితో ఉన్నాడు. ఆ యువతి వాని భార్య. అనగా అతను సర్వస్వతంత్రంగా తన ఆనందానికై ఆమెను వినియోగించుకోవచ్చు. చేతనున్న ఫలం.

దాన్ని అనుభవించడానికి ఆరాటపడుతున్నాడు. ఇంకా కొంతసేపు ఆమె వస్తుందని ఓరిమి వహించి కూర్చున్నాడు. కాని ఆమె అలాగే నిలబడి ఉంది. పోనీ, తానే పలుకరిద్దామని దగ్గరకు వెళ్ళాడు. 'మాట్లాడకుండా అలా నిలబడ్డావేం?' అన్నాడు. ఆమె మాట్లాడలేదు. ఆమె భుజంమీద చెయ్యి వేసి 'ఎంతసేపు ఇలా నిలబడతావు ? వచ్చి మంచంమీద కూర్చో' అన్నాడు. ఆమె యింకా ముడుచుకొనిపోయింది ఊఁ, కదలు !' అని చెయ్యి పట్టుకొనిలాగాడు. చేతిని బిగబట్టుకొని ఆమె కదలలేదు.

ఆమెవలెనే అతనుకూడా ఈ రకమైన కలయికకు క్రొత్తవాడైతే తానుకూడా కొంత సిగ్గుపడి ఉండేవాడు; ఆమెలోని సిగ్గును గ్రహించగలిగి ఉండేవాడు. ఆమె సిగ్గులోని అందాన్ని చూచి ఆనందించేవాడు. కాని అతను ఇంతకుముందు ఒక స్త్రీతో ప్రణయానందాన్ని అనుభవించినవాడు. నిమిష నిమిషానికీ వానికి కమలంపోనభావాలు మధుర వాక్కులు తలపుకి వస్తున్నాయి. ఆమెకంటె అందంగా, ఆనందంగా, ప్రవర్తించె సరస్వతి తనని సంతోష పెడుతుందని ఆశించి ఈ కార్యానికి అతను సిద్ధపడ్డాడు. మొదటిసారిగా భర్తను కలుసుకొన్నప్పుడు ఆమెకు సిగ్గు భయమూ కలుగుతాయనే జ్ఞానం వానికి లేదు. 'మొదటి సారిగా తాను కమలాన్ని కలుసుకొన్నప్పుడు చిరునవ్వుతో మెరిసే కళ్ళతో, ముద్దులొలికే మాటలతో ఎలా ఆహ్వానించింది. ఈమెలో అవేమీ లేవు సరిగదా ముఖమెత్తి చూడనైనా చూడదు. అడిగినమాటకు నోరు విప్పి సమాధాన

మైనా చెప్పదు. ఛీ! ఇది మనిషికాదు, అడవి జంతువు! దీనితో నాకు సరసమేమిటి! నా ఖర్మం కాలి ఈ కార్యానికి సిద్ధపడ్డాను. అనుకొన్నాడు రంగారావు. ఇంక వాని ఓరిమి దూరమైంది, కోపం, విసుగు, అసహ్యం మొదలైన లక్షణాలు వానిలో విజృంభించాయి. చివాలున లేచి గది తలుపు తీసికొని బయటకిపోయాడు. ఎవరితోనూ చెప్పకుండా రెండవనాటి రాత్రికి రామచంద్రపురంలోని కమలం దగ్గరకు చేరిపోయాడు రంగారావు.

# 8

"మొదటరాత్రి నాకు కలిగిన సిగ్గూ భయమూ కారణంగానేకదా ఆయన కోపగించి వెళ్ళిపోయారు. యీ పాడు సిగ్గూ భయమే నన్ను సర్వనాశనం చేశాయి. ఆయన నాదగ్గరికివచ్చి భుజంమీద చెయ్యివేసి పలుకరించినప్పుడు ఒక్కమాటైనా మాట్లాడలేకపోయానే! నేనెంత పనికిమాలినదాన్ని. పెళ్ళయిన మొదలు నేటివరకూ మొఖమెత్తి ఆయన ఎలా ఉంటారోకూడా చూడలేనిదానికి మొగుడెందుకు? నేను ముద్దును, బొయ్యబొమ్మను, నాకంటె కుక్కలూ కాకులూ ఎంతో నయం. దగ్గరజేరి ముద్దుగా పలుకరించిన భర్తతో ఒక్కమాట మాట్లాడి; లేదా ఒక్క చూపైనా చూసి ఆయన్ని సంతోషపెట్టలేకపోయిన ఈ బొయ్యిదుంగకి మగని సుఖం ఎలా దొరుకుతుంది? ఇంత మూర్ఖంగా ప్రవర్తించిన నాదగ్గరికి ఆయన మళ్ళీ వస్తారా?

ఏమో!' అని సరస్వతి పరిపరివిధాల పశ్చాత్తాప పడింది. తన్ను తాను నిందించుకొని ఏడ్చింది.

నీమొగుడు అలా కోపగించి వెళ్ళిపోడానికి కారణ మేమిటని తల్లి కాంతక్క, పెద్దమ్మ మొదలైన వారడిగారు. ఏమని చెప్పగలదు ?

"నువ్వేమైనా తప్పుగా మాట్లాడావా ? వెంకి తనంగా ప్రవర్తించావా ?" అని తల్లి అడిగింది.

"అయ్యో ప్రారబ్ధం ! ఆయనతో మాట్లాడగలి గితే ఈ అవస్థ ఎందుకు వస్తుంది ?" అనుకొంది సరస్వతి మనస్సులో. ఎవరికీ, ఏమీ చెప్పలేక పోయింది. ఎంత ఆలో చించినా తాను సిగ్గుపడి మాట్లాడలేక పోడంతప్ప మరే తప్పూ తనలో కనిపించలేదామెకు. చుట్టుపక్కల అమ్మ లక్కలంతా రకరకాలుగా ఆమెకు ధైర్యం చెప్పారు. అందరూ చెప్పినదాని సారాంశం – రంభలాంటి పిల్లవు. నిన్ను విడిచి అతడెక్కడికి పోతాడే ? తిక్క తిరగగానే వెతుక్కుంటూ వచ్చి నీపాదాలమీద పడతాడు. ఓయమ్మో ! చాలామందిని చూశాం ఇలాంటివాళ్ళని ! – అని.

అందరూ తిరిగి వస్తాడని చెప్పడం విని తన భర్త తప్పకుండా వస్తాడనే విశ్వసించి ధైర్యం వహించింది సరస్వతి.

## 9

చిత్రమేమంటే, భర్త ఎలా ఉంటాడో స్పష్టంగా చూడకుండానే సరస్వతికి పెళ్ళయింది. పునస్సంధానంకూడా

అయింది. ఎప్పటికప్పుడే భర్తను స్పష్టంగా చూడాలనే అభిలాష ఆమెకు ఎంతగానో ఉండేది. కాని! వల్లమాలిన సిగ్గు ఆమెను ముంచెత్తేది. గుండె దడదడ కొట్టుకునేది: ఆ కారణంగా ఎప్పటికప్పుడే తరువాత చూద్దాంలే అని మనస్సు సరిపెట్టుకొనేది. దూరంనుండి చాటుచాటుగా చూచిన వాని రూపం మసక మసకగా ఆమె మనస్సులో ఉంది. కాంతక్క భర్తను ఆమె తరచూ చూస్తో ఉంటుంది. తన భర్తయొక్క అస్పష్టరూపం కాంతక్క మగడు, గోపాలం భావనలో కలసి మెలసి ఉందనుకొంది. కాంతక్క మగని రూపునుబట్టి తన భర్తయొక్క రూపానికి స్పష్టతను ఆపాదించుకొంది. వానిలాగే కొంచెం పొడవుగా, బలంగా నల్లని క్రాపుతో, గుండ్రని ముఖంతో ఎఱుపూ తెలుపూ కలసిన రంగుతో ఉంటాడని తన భర్తయొక్క రూపాన్ని మనస్సులో స్పష్టంగా ఊహించుకొంది. ఆ రూపాన్నే పదే పదే తలచుకొనసాగింది. అలా తలచుకొన్నప్పుడల్లా ఆమె ఒడలు గగుర్పొడుస్తుంది. శరీరం ఉప్పొంగుతుంది. ఆమెకు ఎగిరి గంతులు వేయాలనిపిస్తుంది. గొంతెత్తి పాటలు పాడా లనిపిస్తుంది. తన మనోఫలకంమీద గాఢంగాచిత్రించుకొన్న భర్తయొక్క ఊహాచిత్రంలో ముద్దుముద్దుగా మాట్లాడు తుంది. వానితో కలసి ఏవేవో మధురాను భూతులను పొందుతూన్నట్లు ఊహించుకొంటూ మదించిపోతుంది సరస్వతి. అలాగే కళ్లు మూసుకొని తలగడలను కౌగలించు కొని గంటలకొద్దీ పడుంటుంది.

ఈవిధంగా ఎప్పటికప్పుడే రేపో మాపో భర్త వస్తాడనే ఆశతో గాలిలో మేడలు కట్టుకొంటూ సరస్వతి ఒక వందరాత్రులు గడిపింది.

# 10

శంకరశాస్త్రిగారు అల్లుని ఆగ్రహం పోగొట్టడానికి శతవిధాల ప్రయత్నించాడు. తాను స్వయంగా వెళ్ళి బ్రతిమాలాడు. బంధువు లందరిచేత చెప్పించాడు. కాని ఇసుమంతకూడా ఫలితం కనిపించలేదు. డబ్బు ఆశ చూపిస్తే అల్లుడు ఏమైనా లొంగుతాడేమోనని— 'వెయ్యి రూపాయలు ఇస్తాను. నీవు ఆనందంగా ఖర్చుపెట్టుకో. మా యింటికి వచ్చి నాలుగు రోజులుండి వెళ్ళు నాయనా!' అన్నాడు,

"ఆ వెయ్యి రూపాయలూ నేనే ఇస్తాను మీరు నన్నీవిధంగా వేధించకుండావుంటే" అన్నాడు రంగారావు.

ఇంక రంగారావు తమ యింటికి రావడము కల్ల యని నిర్ణయించుకొన్నాడు శంకరశాస్త్రిగారు. అమ్మాయిని తీసుకొనివెళ్ళి వారింటిదగ్గర ఒప్పగించేస్తే నెమ్మది మీద అతనే ఆదరిస్తాడనుకొన్నాడు శాస్త్రిగారు.

మంచిరోజున సారె చీరెలతో సరస్వతిని అత్తవారింటికి తీసుకొని వెళ్ళాడు శాస్త్రిగారు. ఆసమయాన రంగారావు ఇంటివద్ద లేడు. తల్లి శారదాంబ కోడలిని చూచి ఎంతో ఆనందించింది. ఆమెను ఆదరించింది.

అల్లుడు ఇంటికి వచ్చాక నీభార్యను నీకు ఒప్పగించి పోతున్నాను. నీ యిష్టం, నీ వెలా చూసుకున్నా సరే నాయనా! పెళ్ళి చేసేవరకే మా బాధ్యత. ఆతర్వాత ఆమె బాగోగులు చూడవలసినవాడవు నీవు. అని చెప్పి పోదామని ఆగాడు శాస్త్రిగారు.

ప్రతిదినం ఏదో వేళ భోజనానికి ఇంటికి వచ్చే రంగారావు ఆనాడు ఇల్లు చేరలేదు. ఆ మరునాడు సాయంకాలం వరకూ వానికై ఎదురుచూచాడు శాస్త్రిగారు. అప్పటికీ రాలేదు. ఎక్కడ వుంటాడని ఆ చుట్టుపక్కలవారిని అడిగాడు. ముత్తయ్య దుకాణంవద్ద ఉంటాడని కొందరు, కమలం దగ్గర ఉంటాడని కొందరు చెప్పారు. ముత్తయ్య దుకాణందగ్గరకు వెళ్ళి 'ఇక్కడ మారంగారావు ఉన్నాడా!' అని అడిగాడు.

"ఏం సామీ, ఆ రంగారావు మీా కేమవుతాడు?" అని అడిగాడు ముత్తయ్య.

"మా అల్లుడేనయ్యా! వానితో మాట్లాడవలసిన పని ఉంది."

"బాబూ: మంచి అల్లుడినే సంపాదించారు! అంత దగుల్బాజీకి పిల్ల నెలా ఇచ్చారండీ? అతను మీా పిల్లను ఏల్తాడా? ఆ ఆశ వదలుకోండి బాబూ!"

"అంతా మా ప్రారబ్ధం నాయనా! ఏం చేస్తాము సరే కాని, అత నెక్కడున్నాడో చెప్తే ఒకసారి మాట్లాడి పోతాను."

"ఇప్పుడెక్కడున్నాడండీ సామీ ! నన్ను మోసం చేసి సర్వనాశనం చేశాడండీ !"

"ఏమి, నీకేం అపకారం చేశాడు ?"

"ఇంకేం చెయ్యాలి సామీ ? ఒంటినిండా నగలతో ఉన్న నా కూతుర్ని లేవనెత్తుకు పోయాడు. పొద్దొడిచింది మొదలు వెతికి వెతికి నాకాళ్ళు పడిపోయాయి. ఈ చుట్టుపక్కల ఊళ్ళల్లో ఎక్కడా లేదు. ఎప్పటికైనా దొరక్కమానదు లెండి. దొరికాడా ఏ కాలో, చెయ్యో తీశేసి మూల కూర్చోబెట్టాననుకోండి !"

శాస్త్రిగారింక వాని మాటలు వినలేక పోయాడు. ఆయనకు తల గిఱ్ఱున తిరిగిపోయింది. నీరసంగా నిట్టూర్చి కాళ్ళీడ్చుకొంటూ ఇంటికి చేరాడు.

శారదాంబగారికి తన కొడుకు కమలాన్ని తీసుకొని ఎక్కడికో పోయినట్లు శాస్త్రిగారు చెప్పేవరకూ తెలియదు. 'ఇంక నా గతేమిటి అన్నగారూ !' అని విలపింపసాగింది.

సరస్వతికి తన భర్త విషయం ఇప్పటికి పూర్తిగా అర్థమైంది. దీని కంతకూ కారణం తానే అని ఊహించుకొనేసరికి ఆమె గుండె చెరువైపోయింది. తనమీద తనకు కలిగిన ఆగ్రహానికి అంతులేదు. లోపలికిపోయి తలను గోడకు కొట్టుకొని ఏడవసాగింది.

"ఎక్కడున్నా వెదికి తీసుకొస్తానమ్మా ! ధైర్యంతో ఉండు. ఏనాడో చేసుకొన్న దుష్కర్మ ఫలితాన్ని ఈనాడిలా అనుభవిస్తున్నాం" అని శారదాంబగారిని ఓదార్చాడు శాస్త్రిగారు.

ఈ స్థితిలో కూతుర్ని ఇక్కడ వదలి వెడితే ! నూతిలోనో, గోతిలోనో పడుతుందని ఆయనకు భయం కలిగింది. అందుచే శారదాంబగారిని ఒప్పించి కూతురుని తీసకొని స్వగ్రామం వెళ్ళిపోయాడు.

# 11

శాస్త్రిగారు కూతుర్ని వెంటబెట్టుకొని వచ్చినసంగతి రంగారావుకి బజారులో ఉండగా తెలిసింది. అత్తవాళ్ళే సరస్వతిని ఇలా తీసుకొనివస్తారని అత డనుకోలేదు. వాళ్ళని వదల్చుకోడ మెలాగాఅని ఆలోచించాడు. వాళ్ళుండగా ఇంటికి వెడితే మామగారు ఏదో నచ్చచెప్పడానికి ప్రయత్నించడం. తాను కఠినంగా జవాబు చెప్పడం జరుగుతుంది ఆ వాగ్వాదం విని నలుగురు చేరుతారు. అందరూ తనకు నచ్చచెప్పడానికి ప్రయత్నిస్తారు. అందరికీ సమాధానాలు సంజాయిషీలు చెప్పుకోడానికి తలప్రాణం తోకకి జేరుతుంది. ఆ రభసంతా లేకుండా వచ్చినవారిని వచ్చిన త్రోవనే తోలెయ్యడానికి వానికి ఒకే ఒక ఉపాయం తోచింది. ముత్తయ్యను పిలిచి మామగారు కూతుర్ని తీసుకొనివచ్చిన సంగతి చెప్పాడు. 'వాళ్ళని సాధ్యమైనంతత్వరలో వదలించుకోవాలి. నేనూ కమలం కాకినాడ పోతాం. వాళ్ళెవరైనా నాకోసం వస్తే కమలాన్ని తీసుకొని ఎక్కడికో పరారైపోయానని చెప్పు. రెండురోజులు చూచి వాళ్ళే పోతారు. వాళ్ళు పోగానే మాకు కబురుచెయ్యి. మేము వచ్చేస్తాం'

అని చెప్పి ఒక పదిరూపాయలనోటు ముత్తయ్య చేతిలో పెట్టాడు.

'చిత్తం బాబూ. అలాగే! అని ముత్తయ్య వాని ఆజ్ఞను శిరసావహించి అక్షరాలా పాలించాడు'

'కాకినాడ వెళ్ళి గానసభలు చూచివద్దాం, రా!' అని ప్రోత్సహించి రంగారావు కమలాన్ని కాకినాడ తీసుకొని పోయాడు.

శాస్త్రిగారు కూతుర్ని తీసుకొనివెళ్ళినతర్వాత ఆ రాత్రి పదిగంటలకు రంగారావు ఇంటికి వచ్చాడు. తల్లి ఆశ్చర్యపడి 'ఎక్కడికో వెళ్ళిపోయావన్నారు! నిజం కాదేమిటిరా?' అని అడిగింది.

'వాళ్లింకా ఇక్కడఉంటే వెళ్లిపోయేవాడినే!' అన్నాడు రంగారావు.

'వాళ్లు చేసిన అపరాధమేమిటి నాయనా? నీభార్యకు ఏమి లోపముందని నీకు అంత కోపం?'

'ఇప్పటికి అనేకసార్లు చెప్పాను. ఇంక ఆఖరుసారిగా చెప్తున్నాను. అదొక జంతువు. అది నాకు భార్యగా ఉండ డానికి అర్హులుకాదు. నేను కనిపిస్తూ ఇంట్లో ఉండాలంటే నోరెత్తకుండా నేను చెప్పినదానికి అంగీకరించు. వాళ్ళ తోనూ వీళ్ళతోనూ చెప్పుకొని ఇంకా నాకు నచ్చజెప్ప డానికి ప్రయత్నిస్తే ఇంక ఈ జన్మలో నేను నీకు కను పించను' అని కఠినంగా నిష్కర్షగా చెప్పాడు రంగారావు.

ఈ మాటలతో తల్లి గుండెలు దడదడ లాడాయి. ఒక్కగానొక్క కొడుకు. వానిని చూచుకొని ఆమెబ్రతుకు

తోంది. అతను కంటికి కనుపించకపోతే తానుజీవించగలదా? బెంగపెట్టుకొని, కృశించి ప్రాణాలు వదిలేస్తుంది. ఎలా తిరిగినా, ఎంత ఖర్చుచేసినా ఇప్పుడు తెంచుప్రూటలా రంగారావుముఖం ఆమెకు కనిపిస్తుంది. అంతట్లోనే ఆమె తృప్తిపడి రోజులు గడుపుతోంది—'పోనీ నాయనా! నీకంత అయిష్టమైనప్పుడు దాని మాటే ఎత్తను' అని చెప్పి హృదయాన్ని కుదుటబరచుకొంది.

'అలాఅని నువ్వూ నేనూ ఊరుకొన్నంత మాత్రాన వాళ్ళు వదలిపెడ్తారా? మధ్యమధ్య వచ్చి నసపెట్టి హింసిస్తూనే ఉంటారు. అంచేత వాళ్ళతో తెగతెంపులు చేసుకోవాలి. రేపే స్త్రీసమితితో మాట్లాడి విడాకులు వ్రాసి పంపేస్తాను' అన్నాడు రంగారావు.

ఈ మాటలతో శారదాంబకు భయాందోళనలు కలిగాయి, 'ఆపనిమాత్రం చెయ్యకు నాయనా! ఇంతవరకు గౌరవంగా బ్రతికిన కుటుంబం మనది. మీ నాన్నగారు ఎంతో పరువు ప్రతిష్ఠలతో బ్రతికారు. వారికి కళంకం తీసుకొనిరాకు బాబు!'

'దీనికి తప్పేముందమ్మా? మనకి ఇష్టంలేదు. ఆ విషయం సక్రమపద్ధతిలో వారికి తెలియజేస్తాం. పెండ్లి చేసుకొన్న అపరాధానికి మనోవృత్తి ఇస్తాం; అంతే! ఇందు అప్రతిష్ఠ ఏమీకాదు.'

'వద్దు నాయనా వద్దు! నామాట విను!' అని తల్లి చెబుతూంటే 'అదేమీ పనికిరాదు. వాళ్ళతో సంబంధం పెట్టుకొని నేను బాధపడలేను. నువ్వింకా ఇలా పీకులాడితే

రేపే నేను ప్రయాణమౌతాను. ఇంక నేను కనిపిస్తాననే ఆశ వదలుకో !' అన్నాడు రంగారావు.

కంటికి కనుపించకుండా పోతాననే రంగారావుమాట ఆమెమీద బ్రహ్మాస్త్రం లా పనిచేసింది. ఆమె ఇంక మాట్లాడలేకపోయింది.

# 12

శంకరశాస్త్రిగారు కూతుర్ని తీసుకొని ఇల్లుచేరిన రెండురోజులకు ఆయనకు ఒక రిజిష్టర్డు కవరు వచ్చింది. అందు రంగారావు సరస్వతికి విడాకు లిచ్చిన విషయం వ్రాయబడి ఉంది. నెలకు 20 రూపాయలు మనోవర్తిగా ఇస్తాననికూడా వ్రాశాడు రంగారావు. ఈ విషయాలు చదివి శాస్త్రిగారు నిశ్చేష్టుడైపోయాడు. కాగితం చేతబట్టుకొని ఉన్నచోటనే చతికిల బడ్డాడు. భార్య ఏమిటేమిటని ఆదుర్దాగా అడిగింది. కొన్ని క్షణాలు ఆయన నోట మాట రాలేదు. ఆ తరువాత ఆయన నెమ్మదిగా భార్యకు విషయం తెలియజేశాడు.

ఆమె 'అయ్యో ! నాతల్లీ ! నీ కర్మ మిలా కాలిందేమమ్మా !' అని దగ్గరనేవున్న సరస్వతిని కౌగలించుకొని యేడ్చింది. సరస్వతి కొయ్యలా నిలబడిపోయింది. కళ్ళనుండి నీరు కాలువగట్టి ప్రవహిస్తోంది. ఇరుగుపొరుగువారంతా చేరారు. తలోక విధంగా రంగారావునుగురించి మాట్లాడారు—'నుదుటనున్న రాతను తప్పించగల వా రెవ

రమ్మా ? అన్నివిధాలా అనుకూలమైన సంబంధం ఏరి కూర్చారు. ఇలా మధ్యలో వాని బుద్ధి వక్రిస్తే మీరేం చేస్తారు ? ఇంక గుండె రాయి చేసుకోవాలి. ఏనాటికైనా అమ్మాయి గ్రహస్థితి బాగుంటే వాని బుద్ధి మారవచ్చు. బుద్ధి మారిందంటే మరుసటి నిమిషంనుంచీ చిలకా గోరింకల్లా కాపురం చేస్తారు—' అని వారిని ఓదార్చారు.

ఇప్పుడు సరస్వతి కన్యగాని కన్యగా విధవగాని విధవగా ఐంది !

# 13

రోజులు, మాసాలు గడిచిపోతున్నై. రంగారావు రెండేసి, మూడేసి ఎకరాలచొప్పున తనకున్న భూమిని అమ్మేస్తున్నాడు. కమలానికి ఇరవై వేల రూపాయలతో చక్కని మేడ కట్టించాడు. రంగారావు సంపద రోజురోజుకీ కమలంఇంటికి ఎగుమతి అయిపోతోంది.

కొడుకు చేసే దుశ్చేష్టలకు శారదాంబగారు కుమిలి కుమిలి కృశిస్తోంది. ఇదేమి నాయనా, అంటే ఇల్లు విడిచి పోతానంటాడు కొడుకు. చిన్ననాటినుండీ అల్లారుముద్దుగా పెంచిన కొడుకు కంటికి కనుపించకుండా పోతాడనే భయం చేత వాని నేమీ పల్లెత్తు మాటకూడా అనకుండా ఆవిడ తనలో తానే బాధపడుతోంది

ఈవిధంగా రెండు సంవత్సరాలు గడచి పోయాయి; రంగారావు ఆస్తి అంతా సమాప్తమై పోయింది. ఇంక ఇల్లు

కూడా అమ్మివేయడానికి అతను ప్రయత్నించాడు. ఆ విషయం కమలానికి తెలిసింది. 'ఇల్లుకూడా అమ్మివేసి తల్లిని ఏం చేద్దామని మీ వుద్దేశ్యం ?' అని ఆమె రంగారావుని అడిగింది.

"డబ్బు అవసరం. అమ్మక ఏంచెయ్యను ?" అన్నాడు రంగారావు.

"ఔను పాపం! అవసరం సామాన్యమైనది గనుకనా! పేకాటకు డబ్బు లేకపోతే పీక ఎగిరిపోదూ !" అంది వ్యంగ్యంగా.

"ఎప్పుడూ నువ్వు ఇలాగే మాట్లాడతావు, పోదూ! చేతిలో డబ్బు లేకపోతే నాకు పిచ్చెక్కిపోతుంది."

"ఔనౌను, పోతుంది ! తప్పకుండా పోతుంది ! పెద్దలు సంపాదించి పెట్టారు;' త్వరగా తగలెయ్యి నాయనా, లేకపోతే మాకు మోక్షంలేదు' అన్నారు ! సాధ్యమైనంత త్వరలో మీరు వారి ఆస్తినంతా పూర్తిచేసి వారి ఆజ్ఞను అక్షరాలా పాలించారు ! నిజంగా పెద్దల గౌరవాన్ని నిల బెట్టడంలోనూ వారిని తరింప జేయడంలోనూ మీకు సాటి వచ్చే సుపుత్రులు చాలా తక్కువగా ఉంటారు ప్రపంచంలో ! అంతా ఖర్చైపోయినతర్వాత ఇంకెక్కడనుండి వస్తుంది డబ్బు? నేడో రేపో ఇంక మతిపోవడమే తరువాయి!"

"నీ ధోరణి ఏమిటో నాకు అర్థం కావడం లేదు. వింతగా మాట్లాడుతున్నావు !"

"వింతగా ఉండదు మరి ! మీ మనస్సుకి అనుకూలంగాలేని మాటలన్నీ మీకు వింతగానే కనుపిస్తాయి !"

"ఐతే ఏం చెయ్యమంటావ్ ?"

"నేను ఏం చెప్తేమాత్రం ప్రయోజన మేమిటి ? ఇంకా సమయం రాలేదు, ఈ ఇల్లుకూడా పోయినతర్వాత చెప్తాను" అంది కొంచెం గంభీరంగా కమలం.

'వ్యంగ్యంగానూ గూఢంగానూ మాట్లాడి నన్ను వేధించకు. కమలం, నన్ను పూర్తిగా కాళీ అయిపోయింది. ఎప్పుడూ ఏ విషయానికీ కొరతలేకుండా జీవించినవాణ్ణి. డబ్బులేకుండా ఎలా కాలక్షేపమౌతుంది.'

ఈ మాటలకు కమలం ఫక్కున నవ్వింది.

'ఎలక్కి ప్రాణ సంకటం పిల్లికి చెలగాటం! నీకేం నవ్వుతావ్ ! ఇల్లు అమ్మకపోతే మరేవిధంగా డబ్బు వస్తుందో చెప్పకూడదూ ?'

కమలం నవ్వు తగ్గించుకొని 'సరే, మీ ఉద్దేశం ప్రకారం ఇల్లు అమ్మివేస్తారనుకొండి. మీ తల్లిగారి మాట కేమిలెండి; నిలువ నీడలేకపోతే ఎవరిపంచనో చేరి కాలక్షేపం చేస్తారు. మీకు పర్సునిండా డబ్బు వస్తుంది. ఆ డబ్బు మీ ఖర్చుకి ఎన్నాళ్ళవరకు సరిపోతుందో చెప్పండి!'

'నీకు కళావరు నెక్లెస్ చేయించాలి. మనం మేడ మీదికి ఫర్నిచర్ కొనాలి. ఈసారి ఆ మార్వాడీకి ఇవ్వ వలసిన నాలుగువేలూ వాడి ముఖాన పారేస్తాను; సైతాను లా వేధించుకుంటున్నాడు. రమారమీ పదివేలు వస్తాయి గనుక చాలవరకు అవసరాలు తీరుతాయి.'

'అసలువిషయం చెప్పనేలేదు; మరిచిపోయారా ?'

'ఇంకేముంది.'

'ఇంకేమీ లేదా ?'

'ఆc, ఉంది మన రేడియో మార్చివేసి రేడియో గ్రామం కొనాలి. దానికి ఎనిమిదినంద ఔతుంది.'

'వీటన్నిటికీ ముందుగా భారీఎత్తున చేసే అత్యవసర మైన ఖర్చు ఉంది. ఇలాంటివి ఎన్నికొంటే తరుగుతాయి పదివేలు ?'

'ఇంక ఖర్చేముంది ?' స్పష్టంగా మాట్లాడుదూ చంపక !'

'అబ్బ ! పెద్దలు సంపాదించిపెట్టిన ఆస్తిని ఖర్చుపెట్ట డానికి ఎంత తెలివి ఉపయోగిస్తున్నారండీ ?' అంది నవ్వుతూ కమలం.

'ఓహోహో! మళ్లీ అదేపాటా? వాళ్ళకి ఆనందంగా అనుభవించటం చేతగాక వదలిపెట్టిపోయారు. మనం జల్సాగా ఉన్నదాన్ని అనుభవిస్తున్నాం. బ్రతికున్న రెన్నాళ్లూ సుఖంగా, ఆనందంగా, ఉన్నదాన్ని అనుభవించలేనివాడు వట్టి మూర్ఖుడనుకో !'

కమలం మళ్ళీ నవ్వసాగింది.

'అబ్బ; నవ్వా వేళాకోళమేగాని అసలు విషయం స్పష్టంగా మాట్లాడవు ! మనస్సులో ఉన్నది విప్పిచెప్పవు !'

'చెప్పడానికి నే నెంతటిదాననండీ ? ఉన్నత కుటుం బంలో పుట్టారు; చదువుకొన్నారు; చిన్నప్పటినుండీ రాజ కుమారుడిలా పెరిగారు. మీ తెలివి, విజ్ఞానం దృష్టిలో పెట్టుకొంటే మీతో మాట్లాడ్డానికి నా కంఠం కంపించాలి నిజానికి.'

"కమలం, ఇవేళ నన్ను ఏడిపించాలని తలచు కొన్నావా ?"

"ఛాఛా ! ఎంతమాట ?"

"ఐతే స్పష్టంగా చెప్పు. డబ్బుకి సాధన మేమిటో."

"నా ప్రశ్నకి సమాధాన మివ్వకుండా మళ్ళీ మొదటికి వస్తారేం ?"

"నీ ప్రశ్నేమిటి ?"

"ఇల్లు అమ్మగా వచ్చే డబ్బు ఎంతకాలంవరకూ మీా ఖర్చుకి సరిపోతుంది ?" అని సూటిగా ప్రశ్నించింది.

"చెప్పానుగా ఖర్చులు. ఆ ఖర్చులు పోగా ఇంకేం మిగులుతుందో లెక్క వెయ్యలేదుగా ?"

"లెక్క వేసి చెప్పండి !"

"మాధవాడీకి సర్టిఫికేట్‌తో కలుపుకొని ఐదు వేలు, నెక్లెస్‌కి వెయ్యి, రేడియోకి వెయ్యి, పర్నిచర్‌కి రెండు వేలు. ఇంక ఒక వెయ్యి మిగులుతుంది. అది ఓ నెల ఖర్చుకి సరి పోతుంది."

"ఎంత త్వరగా వేశారండి లెక్క ! నే నాతే కిందా మీాదా పడి నాలుగు గంటలకికూడా లెక్క తేల్చ లేక పోయేదాన్ని."

"సరే, దాని కేమిటే ! చెప్పానుగా నీ ప్రశ్నకి సమాధానం. నువ్వు చెప్పదలచిం దేమిటో చెప్పు."

"ఇంకొక్క చిన్న ప్రశ్న. దయయుంచి దానికికూడా సమాధానం చెప్పండి. తరువాత నేను చెప్పవలసింది చెప్తాను."

"ఊఁ, కానియ్యి మరి !"

"అమ్మబోయే ఇంటితో మీ ఆస్తి పూర్తిగా ఖర్చై పోతుంది, దాని తాలూకు డబ్బుకూడా ఒకనెలతో పూర్తవు తుంది. ఆ తరువాత మీకింక డబ్బు అవసర ముండదా ?"

"ఎందు కుండదూ ? డబ్బు అవసరంలేని రోజుం టుందా మనకి ?"

"ఐతే అప్పుడింక డబ్బు ఎక్కడనుండి తెస్తారండీ !"

"ఓశ్, ఇదేనా నువ్వువేసే గొప్పప్రశ్న ? ఇన్నాళ్ళ నుంచీ నన్ను ఇంతమాత్రనే తెలుసుకొన్నా వన్నమాట?" అని రంగారావు నవ్వుతూ అన్నాడు.

"అదేకదూ నేను చెప్పకొన్న విషయమూను. ఆ మాత్రం తెలివే నాకుంటే మిమ్మల్ని అడగడ మెందుకు?"

"ఒక్కరోజు పేకాటలో సంపాదిస్తాను, నెలకు సరి పడే ఖర్చంతానూ."

"ఆఁ ! అలాగటండీ ! చూశారా; మీరు చెప్పే వరకూ తెలుసుకో లేకపోయాను, మీలో ఉండే మహ త్తరమైన శక్తిని ! ఐతే ఇంతకుముందు చాలాకాలం పేకా డుతూ వచ్చారుగదాఁ ఆ సంపాదించిన డబ్బంతా ఏం జేశా రండీ ?" అని నిజంగా అమాయకురాలిగా అడిగింది కమలం.

కమలం అంత అమాయకురాలుకాదని రంగారావుకి తెలుసు. ఇదంతా తనను మాటలతో పట్టి కొట్టించి తన కేదో ఉపదేశం చేద్దామనే ఉద్దేశంతో ఇలా వ్యంగ్యలి గానూ, హేళనగానూ మాట్లాడుతోందని తెలుసుకొన్నాడు.

కమలంతో స్నేహం చేసిననాటినుండి నేటివరకూ తనది రాజా జీవితమనే విషయాన్ని వెల్లడించేటట్లుగా మాట్లాడుతూ వచ్చాడు. తన ఆస్తి అమ్మకాల విషయం అతను ఆమె కెన్నడూ చెప్పలేదు. కాని ఆమె ఎప్పటికప్పుడే వాటి నన్నింటినీ తెలుసుకొంటూనే ఉంది. తనకు వానిరహస్యాలు తెలుసుననే విషయం ఆమె ఎన్నడూ సూచనమాత్రంగానైనా తెలియజేయలేదు. రంగారావు ఆమె అడగకపోయినా రకరకాల చీరలతోనూ నగలతోనూ ఆమెను ముంచెత్తాడు. చక్కని మేడ కట్టించాడు. ఇంకా రకరకాలు ఆమెకోసం ఖర్చుపెట్టి ఎప్పుడూ తనగొప్పతనాన్ని ప్రదర్శిస్తూఉన్నాడు. నేటికి ఆస్తి సమాప్తమైంది. ఈ విషయం కమలానికి వివరములతోసహా తెలుసునని ఇప్పుడు రంగారావు గ్రహించాడు. ఇంక ఆమెవద్ద తన విషయాలు మరుగుపరచి మాట్లాడినందువల్ల చివరకు తానుసిగ్గుపడనలసివస్తుందని ఈవేళ తనఅహాన్ని ఆడంబరాన్ని చాలవరకు తగ్గించుకొని ఆమెతో సంభాషించాడు. ఆమె మాట్లాడిన వ్యంగ్యవాక్యాలు, ఎత్తిపొడుపు మాటలను విని అతను తన నిజస్థితిని విమర్శించుకొనవలసివచ్చింది. ఇంటి డబ్బుకూడా ఖర్చయిపోయిన తర్వాత తనకు డబ్బు వొచ్చేకే సాధనమేమీ లేదని అతను గ్రహించకపోలేదు. పేకాటలో తా నెప్పుడూ , నందలకి వందలు పోగొట్టుకొనడమేకాని సంపాదించలేదు. కాని నేటివరకూ తాను ఆమెముందు ప్రదర్శించుకొంటూ వచ్చిన బడాయిని నేడు పోగొట్టు కొంటాడా ? అది వాని కెంత అవమానకరం ! చింత చచ్చినా పులుపు చావదు ! అందుచేతనే

తన మనస్సులో కలిగిన వ్యాకులతను విషాదాన్ని ఎంత మాత్రమూ ఆమెకు తెలియనివ్వకుండా ధైర్యంగానూ, గంభీరంగానూ అన్నాడు—'ఏదీ, నువ్వు సరిగా ఆడనిస్తేనా? ఎప్పుడో ఒక్కొక్క పూట ఆడి మాని వేస్తూంటే లాభంరాదు. విడువకుండా నిత్యమూ ఆడాలి; అప్పుడు చూడాలి మన ప్రతిభ !'

రంగారావు నోటిమాటలతో తేలిగ్గా లొంగి వచ్చే వాడు కాదని తెలుసుకొంది కమలం. వాని తప్పును వానికి ప్రత్యక్షంగా, స్పష్టంగా చూపాలి. అవసరమైతే తనకు యిష్టంలేకపోయినా, వాని ప్రవర్తనయొక్క దుష్ఫలితాన్ని అనుభవించేటట్లు చెయ్యాలి. తన తప్పులను తాను తెలుసుకొని రంగారావు పశ్చాత్తాపపడేవరకూ తాను ఓపిమితోను తెలివిగాను వ్యవహరించాలనుకొంది కమలం—

'మీ ప్రతిభను నేను కాదనగలనా? పేకాటలో నాకు అనుభవమేముంది? కాని పేకాటలో మీరు సంపాదించగలరనే విషయం నాకు ఋజువు కావాలి. అంతవరకూ నాకు నమ్మకం కలుగదు!' అంది.

'ఓ, దానికేం! అదెంతసేపు!' అన్నాడు రంగారావు.

'ఐతే, రేపే పేకాట యేర్పాటు చేస్తాను. దానికి కావలసిన డబ్బు నేను ఇస్తాను. ఒక వారంరోజులు విడువ కుండా మీరు పేకాడండి. ఎనిమిదోరోజుకి మీరు లాభం సంపాదించినట్లయితే మీ మాటల్ని నేను పూర్తిగా నమ్ముతాను.'

దీనితో రంగారావు ధైర్యం దెబ్బతిన్నది. తక్కువ గానో ఎక్కువగానో తా నెప్పుడూ ఓడిపోవడమేగాని ఇంతకు ముందెప్పుడూ వానికి పేకాటలో లాభం రాలేదు. ఇప్పుడు వస్తుందని ఎలా ఆశించగలడు ? లోలోపల బెదురు కలిగినా పైకిమాత్రం గంభీరంగా 'తప్పకుండా పెట్టించు. చూద్దువుగాని మన తడాఖా !' అన్నాడు తెచ్చిపెట్టుకొన్న నవ్వుతో

# 14

రంగారావుతో పేకాడే పెద్దమనుష్యుల్లో కొంత మందిని కమలం యెరుగును. వారు కమలంమీద కన్నేసి అప్పుడప్పుడు సొట్టకబుర్లు చెప్పి పోతూంటారు. కమలం వారితో చమత్కారంగా, హాస్యంగా మాట్లాడి అసలు విషయం మరపించి వాళ్ళని మసిబూసి మారేడుకాయ చేసి పంపిస్తూంటుంది. వారిలో కాంతారావు అనే వానిని రహస్యంగా కలుసుకొని 'ఏమండోయ్, కాంతారావుగారూ, రేపటినుండి మాయింట్లో పేకాట సప్తాహం ! మీరు తప్పకుండా అందులో పాల్గొనాలి. మీరు ఆ భాస్కరం గారినీ, చంద్రారావునీ, వెంకటప్పయ్యనీ నా పేరుమీదుగా ఆహ్వానించండి' అని చెప్పింది.

ఇది విని కాంతారావు ఆశ్చర్యంతో— 'ఇదేదో చాలా వింతగా వుందే ! పేకాట సప్తాహమనేది ఇంతవరకూ నే నెప్పుడూ వినాలేదు కనాలేదు. అందులో నువ్వే ఈ

యేర్పాటు చేస్తున్నావంటే చాలా చిత్రంగా ఉంది !'
అన్నాడు.

"ఏదో ఖుషీగా మీ అందరితోనూ ఓవారంరోజులు కాలక్షేపం చేద్దామని. అంతకంటే విశేష మేమీ లేదను కోండి" అంది కమలం నునుసిగ్గు అభినయిస్తూ.

" 'ఖుషీగా మీతో కాలక్షేపం' అని కమలం అన్న ఈ మాటకి కాంతారావు ఉబ్బి తబ్బిబ్బైపోయాడు— 'జీ, అలాగే, తప్పకుండాను ! నీకు మామీద అంత అను గ్రహం కలిగిందంటే ఇంకేం కావాలి ? మరి, మీ రంగా రావు అభ్యంతర మేమీ ఉండదుకదా ?' అన్నాడు.

"ఆయనకూడా దీనిలో ఒక మెంబరే ! కాని ఒక్క విషయంమాత్రం మీరు దృష్టిలో పెట్టుకోవాలి !"

"ఏమిటది ?" అని కళ్ళు చారెడుచేసి అడిగాడు కాంతారావు.

"మీరు ఈ విషయాన్ని మా రంగాగారికి ఎంత మాత్రం తెలియకుండా అతి రహస్యంగా ఉంచుతానని మాట యివ్వాలి !"

"నువ్వు చెప్పడం మేము తప్పడమూనా ? ఇక నీ గీచిన గీటు దాటననుకో..." అన్నాడు రాగవరుసలో, ఇంతలోనే కమలం తన స్వంతమై పోతునట్లుగా భావించి.

"మీరు నలుగురూ కలసి రంగాగారిని పేకాటలో పూర్తిగా ఓడించాలి. మీరు గెలిచినడబ్బు అణా పైసలతో నాకు వప్పజెప్పాలి. మీకు కాఫీలు, సిగరెట్లు వగైరా సప్లయిలన్నీ నేను చూచుకుంటాను. సరదాగా కాలక్షేపం

చెయ్యడానికి అయన్ని పేకాటలో ఓడించటానికి అనుకోండి ఈ సప్తాహం.'

'రంగారావుతో నీకుఏదైనా మాటపట్టింపువచ్చిందా'

'వచ్చిందికనుకనే మీకు చెప్పడం. తానేదో గొప్ప మొనగాడననీ ఆయన నాతో వాదించాడు లెండి !'

'ఓస్. ఆయన బండారం మాకు తెలీదూ? ఎప్పుడూ ఓడిపోవడమేగా. మేము నలుగురమూ కలసినామంటే వంద లకి వందలు కక్కిస్తాం, చూద్దువుగాని మా తమాషా !'

"మిగిలిన వారికికూడ తెలియజేయండి. అతి రహస్యంగా ఉండాలిసుమా !" అని మలయమారుతంలాంటి ఓ మందహాసం విసరింది కమలం.

ఆ చిరునవ్వుతో కరగి నీరైపోయాడు కాంతారావు. రంగారావుతో పేకాడే ఆ నలుగురువ్యక్తులూ వట్టి నీచులు. వారికి పనీ పాట లేమీలేవు. మాయచేసో, లోకువవారిని దబాయించో నాలుగు రూకలు సంపాదిస్తూ ఉంటారు. వీటిని పేకాటకు, బ్రాకెట్టు ఆటకు, బారీకేసులోని స్త్రీలకు ఖర్చు చేస్తూ ఉంటారు. జల్సాగా రోజులు గడచిపోవడమే వాళ్ళకి కావలసింది.

# 15

ఇప్పుడు ప్రజల దృష్టిలో కమలం అంతస్తు చాల ఉన్నతమైనది. చక్కని మేడలో రకరకాల ఆభరణాలతో ఆమె లోకుల దృష్టిని ఎక్కువగా ఆకర్షిస్తోంది. ఆమె

తన్ను పలుకరించినవారితో చమత్కారంగా హాస్యంగా ముద్దుముద్దుగా మాట్లాడుతుంది. వారి నోళ్లు ఊటలూరించ టమేగాని ఎవరికీ లోకువ ఇవ్వదు. అందర్నీ ఆకర్షిస్తూ ఎవ రికీ లొంగడంలేదు గనుక ఆమె విలువ నానాటికీ పెరుగుతూ వచ్చింది. ఆమె తమతో మాట్లాడనే అదృష్టంగా భావి స్తూంటారు కొందరు. ఆమె ఎదుట బడతారు. ఏవేవో కల్ల బొల్లి మాటలు మాట్లాడతారు. కాని తమ మనస్సులోని అభిలాషను ఆమెకు తెలియజెయ్యడానికి మాత్రం వాళ్ళకి ధైర్యం చాలదు— ఎప్పటికైనా కమలం మనకు లొంగక పోతుందా అనుకొంటూ ఉంటారు.

కమలం ఈ బాపతు మనుష్యుల్ని చిత్తకార్తె కుక్క లంటుంది. వాళ్ళని హేళనచెయ్యడం, ఆశ చూపించి ఏడి పించడం అంటే కమలానికి సరదా.

ముత్తయ్య ప్రోద్బలంవల్ల తనకు నయస్సు వచ్చిన క్రొత్తలో ఆమె ఒక సంవత్సరంవరకూ తన మానాన్ని అమ్మింది. అది యెంత నీచమైన, అసహ్యకరమైనవృత్తియో ఆ సంవత్సరకాలంలోనూ ఆమె అనుభవపూర్వకంగా తెలుసు కొంది. రంగారావుతో పరిచయంకలిగిన మరుక్షణంనుండీ ఆమె ఆ వృత్తిని పూర్తిగా విసర్జించింది. రంగారావు ఆమె హృదయాన్ని పూర్తిగా హరించాడు అతనంటే ఆమెకు వెర్రిప్రేమ. మొదటిరోజుల్లో వానికి పెళ్ళయిందనే విషయం ఆమెకు తెలియదు. క్రమక్రమంగా వానికి సంబంధించిన విషయాలన్నీ ఆమెకు తెలియవచ్చాయి. వానికి పెళ్ళయిం దని తెలిసి ఆమె చాలా బాధపడింది. తరువాత అతను

భార్యను అసహ్యించుకొంటున్నాడని గ్రహించింది. ఆస్తంతా
ఖర్చు చేస్తున్నాడని తెలుసుకుంది. ఆస్తంతా ఖర్చయి
పోయాక వీని గతేమిటి? అనే ప్రశ్న బయలుదేరిందామెలో
తన రంగారావు గౌరవంగా సుఖంగా బ్రతకాలి అనే కోరిక
ఆమెను సదా వెంబడించసాగింది. తాను కోరకుండానే తన
కోసం అతను రకరకాలుగా ఖర్చు చేసేస్తున్నాడు. పేకాట
వానికి వ్యసనమైపోయింది. వాని మనస్సును భార్యమీదకు
మళ్ళించాలి; పేకాట మానిపించాలి. అప్పుడుగాని తన
రంగా బాగుపడడని అనుకొంది కమలం.

తన నేర్పరితనంతో వానిచేత నిత్యమూ పేకాడడము
మానిపించింది. తాను ఎల్లప్పుడునూ వానికి ప్రియురాలుగా
ఉంటాననీ కట్టుకొన్న భార్యను ఆదరించమనీ అనేకసార్లు
ఉద్బోధ చేసింది. కాని రంగారావు ఎంతకు లొంగి రాలేదు.

"ఐతే మీరు నన్ను వదలుకోండి. నా గుమ్మంలో
అడుగు పెట్టడానికి వీల్లేదు! అని ఒకనాడు తన కోపాన్ని
ప్రదర్శించింది. 'మీ రామెను ఇంటికి తెచ్చుకొని ఆదరిస్తే
నే ఎప్పుడైనా నన్ను కలుసుకోడం, మాట్లాడడం జరుగు
తుంది. లేకపోతే మీకూ నాకూ ఇంతటితో సరి!' అని
ఖచ్చితంగా చెప్పింది.

ఇటు కమలం పట్టు అటు మేనమామ ఉపదేశ ప్రభా
వంవల్ల రంగారావు ఆనాడు పునస్సంధానానికి అంగీక
రించాడు. కాని బలవంతంగా మెరకమీదకు తోడిన నీరు
మళ్ళీ పల్లానికి ప్రవహించింది. సరస్వతి సిగ్గు లజ్జా లేకుండా
వేశ్య లా ప్రవర్తించి యున్నట్లయితే అతను ఆకర్షింపబడి

ఉండేవాడేమో ! కాని అది సంభవించలేదు. అతని మనను అక్కడ నిలువనూలేదు. రెక్కలు కట్టుకొని కమలం వద్దకు వచ్చి వ్రాలాడు.

అతని రాకకు కమలం చాలా అసహించుకుంది. వానియెడల పూర్తిగా తిరస్కారభావం ప్రదర్శించింది. "నీవు కాదంటే నేను ప్రాణత్యాగంచేస్తాను. కాని దాన్నిమాత్రం భార్యగా స్వీకరించలేను" అని మొరపెట్టాడు రంగారావు.

కమల ఏమీ దేవాంశసంభూతురాలు కాదు. ఆమె విజ్ఞానము, వివేకము, సానుభూతి, మానవత్వమూ ఉన్న యువతి వీటితోపాటు ఆమెకు హృదయమూ, స్వార్థమూ, వాంఛలూ ఉన్నాయి. ఆమె రంగారావును మనసారా ప్రేమిస్తోంది. అతను జాలిగా తన్ను బ్రతిమాలడం, తాను చేరనివ్వకపోతే ఆత్మహత్య చేసుకొంటాడనడం వినగానే ఆమె హృదయం కరగి నీరయింది. నన్ను ప్రేమించమని ఆయనకు ఎవరు బోధించారు? అలాగేబోధించడంద్వారాను, బలవంతం చేయడంద్వారాను ఈయనను తన భార్యను ప్రేమించేటట్లు చేయటం నా వశమా ? ప్రేమించడం ప్రేమించక పోవటం అనేవి చేతులతో చేసే పనులుగనుకనా నేను చెప్పినంతమాత్రాన ఆయన చెయ్యడానికి ?" అను కొని వాని నింక ఆ విషయంలో బలవంతచెయ్యడం మాని వేసింది కమలం.

# 16

వారంరోజులు పేకాట సాగింది. ప్రతీరోజూ కమలం రంగారావుకి డబ్బు యిస్తూ వచ్చింది. రేపు వస్తుంది, మాపు వస్తుంది లాభం, అని ఆశిస్తూ వారంరోజులు రంగారావు పేకాట ఆడాడు. ప్రతిదినమూ డబ్బు పోవడమేగాని రావడం లేదు. వారంరోజులూ సమాప్తమయేసరికి రమారమి వెయ్యి రూపాయలు ఓడిపోయాడు. మిగతా నలుగురు ఆటగాళ్ళూ తాము కమలానికి యిచ్చిన మాట ప్రకారం ఏరోజు లాభం ఆరోజుననే ఆమెకు యిచ్చివేసి పోయేవారు. ఇంతకాలానికి గదా, కమలం మనకి లొంగివచ్చింది ! ఈ వారంరోజులూ ఈమెను మెప్పించి ఈమె పొందు సంపాదించాలని ఊటలూరుతూ వచ్చారు. అందరినీ మాయజేసి, బెదరించి, లేక దబాయించి, అందినంతవరకూ డబ్బు హరించే ఆ నలుగురు వ్యక్తులూ కమలం చేతిలో కీలుబొమ్మలై పోయారు. తమకు వచ్చిన డబ్బు అణాపైసలతో ఆమెకు చెల్లించి వేశారు. 'దంపినమ్మకి బొక్కినదే కూడు' అన్నట్లుగా వాళ్ళకి టిఫెన్లు, టీలు, కిళ్ళీలు, సిగరెట్లు మాత్రమే దక్కాయి.

ఆట పూర్తయిపోయిన మరునాడు కమలం రంగారావుతో, "మీకు పేకాటలో సంపాదించటం కల్ల అని ఋజువైందిగదా !" అంది చిరునవ్వుతో.

రంగారావు తన ఓటమికి సిగ్గుపడిపోయాడు. కమలాన్ని చూడ్డానికి వానికి ముఖం చెల్లడంలేదు. తాను ఓడి

పోయిన వెయ్యిరూపాయలూ ఆమెవి. తన డబ్బైతే ఎంత పోయినా బాధపడేవాడు కాదు. ఆమె డబ్బు పేకాటలో ఖర్చుచేసినందుకు బాధపడుతున్నాడు. ఆమె మాటకు సమాధాన మేమీ చెప్పలేదు.

"ఇంక ఇప్పుడు చెప్పండి – ఇల్లు అమ్మేస్తారు: ఆ డబ్బుకూడా ఖర్చైపోతుంది. అప్పు డింకేమి చేస్తారు."

"ఏమి చెప్పడమనేది తరువాత ప్రశ్న. ఇప్పుడు నీకు వెయ్యిరూపాయిలు బాకీపడ్డాను. ఇల్లు అమ్మకపోతే అప్పు లన్నీ ఎలా తీరతాయి ?" అన్నాడు రంగారావు.

"అప్పులు తీర్చడ మెంతసేపు? ఇల్లు అమ్మే శారంటే అలా అప్పులా తీర్చేస్తారు ! తరువాత చేసేదేమిటో కాస్త చెబుదురూ !"

"ఇప్పుడేమి చెప్పగలం ? ఆనాటి పరిస్థితుల్నిబట్టి ఉంటుంది, ఏమి చేసేదీ !

"ఒక నెల రోజుల్లో లోక మేమీ తారుమారుకాదు. నేటి పరిస్థితులే ఆనాడూ ఉంటాయి."

"అబ్బ, నన్ను చంపక ఇంక ఈ ప్రసంగం కట్టి పెడుదూ !"

"ఇలాంటి విషయాలు కట్టిపెడితే కట్టుబడేవికావు. మీకు మంచిరోజులు గడచిపోయాయి. డబ్బు లేకపోతే మీకు గడ్డిపరకంత విలువకూడా ఉండదు. మిమ్మల్ని ఆదరించి పోషించడానికి ఊళ్ళో ఎవరూ సిద్ధంగా లేరు. కడుపు నిండే తిండికి కూడా ఇబ్బంది పడ్డారు మీలాంటి వా రనేక మంది. నేడున్న విలాసాలు, భోగాలు; పరువు; మర్యాదలు;

ఆనాడు ఉండవనేవిషయం, ఏమాత్రం ఆలోచించినా మీ మనస్సుకి తట్టుతుంది. నేను మీరు తాళికట్టిన భార్యను కాననే విషయం జ్ఞాపకముంచుకోండి. మిమ్మల్ని మీరే పోషించుకోలేని స్థితిలో నన్నేమి పోషించగలుగుతారు ? ఆనాడు నా బ్రతుకు తెరువు నేను చూచుకోవలసి ఉంటుంది" అని కోపం ప్రదర్శిస్తూ కఠినంగా మాట్లాడింది.

ఆమె ముఖం ఎరుపెక్కింది. కపోలాలు పొంగాయి. కళ్లు కొద్దిగా చెమర్చి మెరుస్తున్నాయి. కమలాన్ని యీ రూపంలో ఇంతకు ముందెప్పుడూ రంగారావు చూడలేదు. ఆమె మాటలకు అతడు కొంచెం బెదిరాడు. "నా బ్రతుకు తెరువు నేను చూచుకోవలసి ఉంటుంది" అని చివర చెప్పిన వాక్యం వాని మనస్సులో తుమ్మెద లా పరిభ్రమిస్తోంది. అంటే, నన్ను వదలి వేరు మార్గం చూచుకొంటుందన్న మాట అనుకొన్నాడు రంగారావు. డబ్బులేక నేను బికారి నౌతానన్న మాట. తిండికీ, గుడ్డకీ ముఖం వాచవలసివస్తుందని? అని రకరకాలుగా తన భవిష్యత్తును ఊహించుకొనగానే వాని మనస్సు వికలమైపోయింది.

"అంటే, ఆనాడు నువ్వు వేరే త్రోవ చూచుకొని నన్ను విడిచిపెడతావన్న మాట ?" అని దీన స్వరంతో అన్నాడు.

కమలం ఆవేశంలో తాను మనస్సులో ఊహించుకొన్న దానికంటే ఎక్కువ కఠినంగామాట్లాడింది. మాట్లాడడం పూర్తిఅయినతర్వాత "అయ్యో! ఇంత కఠినంగా మాట్లాడా నేమిటి ? ఈయన మనస్సు బాధపడుతుందేమో ?" అని

మనస్సులో నొచ్చుకుంది. "నన్ను విడిచిపెడతావన్న మాట" అని అతను దీనస్వరంతో అనగానే ఆమె మనస్సు నీరై పోయింది. "విడిచిపెడతానా, అసంభవం! నా ప్రాణ ముండగా ఎన్నడూ అలా చెయ్యలేను. విడిచిపెట్టను!" అని ఆమె మనస్సు పరితపించింది. మళ్ళీ అంతలో మనస్సు కుదుట బరచుకుంది. తన కర్తవ్యాన్ని స్మృతి పథానికి తెచ్చుకుంది. ధైర్యం చిక్కబట్టుకొని "నన్ను మీరు పోషించలేనప్పుడు మీతోబాటు పస్తులుండి అవస్తలు పడ మంటారా?" అంది.

"కమలం, నువ్వేనా ఈ మాట లనేది? నేటి వరకూ నీవుచూపిన ప్రేమ అంతా నటనేనా?"

కమలం చలించే మనస్సును, కరగిపోయే హృదయాన్ని ప్రయత్నపూర్వకంగా అదుపులో పెట్టుకుంది.

"నే నెవరినో మీ రెరుగుదురా? మరచిపోయారా?"

"నా ప్రియురాలివి."

"నా కులవృత్తిని స్వీకరిస్తే నే నెవరి ప్రియురాలినైనా కాగలను. ఆ విషయ మెరుగుదురా?"

"నువ్వు అంత నీచంగా ప్రవర్తించగలవని నే ననుకోను."

"నా కులవృత్తిని స్వీకరిండం నాకెంతమాత్రం నీచం కాదు."

"ఐతే కులవృత్తిని స్వీకరించ దలచావా?"

"మీరు బికారిరై నన్ను పోషించలేకపోతే నేను తిండిలేక మాడి చావాలా?"

"కమలం, ఇవేళ నీ గుండె రాయి కావడానికి కారణం ?"

"ఐతే మీరే చెప్పండి. ఇదివరలా నన్ను ఆదరించి పోషించగలరా ? నా ముద్దు ముచ్చటలు తీర్చగలరా ?"

"అంతవరకూ చెయ్యలేక పోయినా నీకు అన్నవస్త్రాలకు లోటులేకుండా చేస్తాను. ఏదో ఉద్యోగంచేసో, వ్యాపారం చేసో మన ఇద్దరి పోషణకు సరిపడేది సంపాదిస్తాను."

"పేకాటలో సంపాదిస్తానని బడాయిలు చెప్పారు. ఆ బండారం బయటపడి పోయింది. ఇంక ఉద్యోగం. వ్యాపారం తరువాయి ! ఎందుకండీ నన్ను ముఖస్తుతి చేయ ప్రయత్నిస్తారు ? చిన్నప్పటినుంచీ జీబునించా డబ్బు తిను కొని ఖర్చుపెట్టడం తప్ప మరేమైనా తెలుసా మీకు ? ఈనాడు ఉద్యోగం, వ్యాపారం చేస్తానంటే, మీ సంగతి తెలియనివాళ్ళయితే నమ్ముతారు గానీ నే నెలా నమ్మ గలను ?"

"నీవేదో నిర్ణయానికివచ్చాక నామాటమీదనమ్మకం ఎలా ఉంటుంది. ఏది ఏమైనప్పటికీ ఒక్క-మాటమాత్రం గుర్తుంచుకో-నిన్ను మనసారా ప్రేమించి నా శరీరం, మనస్సు, ధనం, సర్వస్వం, నీ కర్పించాను. నీవు మనస్సు మార్చుకొని మరోత్రోవ త్రొక్కితే నేను జీవించడం అసంభవం, వ్యర్థం ! ప్రాణత్యాగమే నాకు శరణ్యం !" అని రుద్ధకంఠంతో చెప్పాడు రంగారావు.

వానిమాటలకు కమలం హృదయం శరవిద్ధ విహంగం లా గిలగిల కొట్టుకొంది. ఆమె కొన్ని క్షణాలు నిశ్చేతనమై

పోయింది. పెల్లుబికి వచ్చే దుఃఖాన్ని బలవంతంగా దిగ మ్రింగుకుంది. ఆమెకంఠం పూడుకొనిపోయింది. ముఖం ప్రక్కకు త్రిప్పుకొని కొంతసేపటికి అతి కష్టంతో తన్ను తాను సంబాళించుకొని నిజస్థితికి వచ్చింది—"మీకు చింతా లేకుండా హాయిగా గడచే జీవితాన్ని అధ్వాన్న స్థితికి తెచ్చుకున్నారు. దేనికైనా కొంచెం వెనుకముందు లాలోచించాలి బుద్ధిగలిగిన మానవులం గనుక రేపటిస్థితి యోచించుకొని యేపనినైనా చెయ్యాలి. అమృతాన్నైనా హద్దుమీరి పీకల వరకూ త్రాగితే అజీర్ణంచేసి అది అసలుకి మోసం తెస్తుంది. మనం అనుభవించే సుఖ భోగాలకి హద్దు అనేది ఎక్కడ ఉందో కొంచెం యోచించారా ? అదేపనిగా తింటే గారెలు కనరెక్కుతాయి. మిఠాయి మొహం మొత్తుతుంది. చేసే పనికిగాని తినే తిండికిగాని అనుభవించే భోగాలకుగాని ఒక పరిమితి ఉండాలి. తలకుమించిన తలపులు, శక్తికి మించిన పనులు ముప్పులు తెచ్చిపెడతాయి. నిజస్థితిని మరచి, మీ శక్తిని మరచి, లోకాన్ని మరచి, మీకు కలిగే కష్టనష్టాల్ని మరచి, కన్నతల్లిని మరచి, విచ్చలవిడిగా ప్రవర్తించారు. అంతా అయిపోయిన తర్వాతకూడా మీకు పట్టిన ఆమత్తు వదలలేదు. పేకాటలో సంపాదిస్తాను, వ్యాపారంచేస్తాను, ఉద్యోగం చేస్తాను అని కల్లబొల్లి కబుర్లు చెప్పి నా కళ్ళల్లో కారం జల్లుదా మనుకుంటున్నారా ? ఇంక మీ యిష్టంసాగ నివ్వను. నేను చెప్పినట్లల్లా చెయ్యవలసిందే నామాటకాదని త్రోసిపుచ్చి మీకు తోచినట్లు పాత పంథానే అనుసరించారా; ఈ గదిలో ఇక్కడే నేను చచ్చిపడి ఉంటాను. నా

చావును కళ్ళారా చూడాలంటే ఒక్కసారి మీరు పేకా డండి, నాకు ఒక్క నగ చేయించండి చాలు!"— అని విరామమివ్వకుండా ఏకబిగిని గంభీర ముఖాకృతితో చెప్పింది కమలం. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు తీవ్రంగా ఉన్నందున ఆమె ఎత్తైన వక్షం గాలి తిత్తిలా కదలుతోంది.

ఆమె చెప్పిన మొదటి మాటలకి చివరి మాటలకి సామ్యం కనిపించలేదు రంగారావుకి. ఆమె ధోరణి అర్థం కాక అయోమయావస్థలో పడి ఏమీ మాట్లాడలేక పోయాడు.

ఒక నిమిషం ఇద్దరూ మౌనంగా ఉన్నారు. తరువాత కమలం—"ఏమంటారు? నా మాటలకి జవాబు చెప్పరేం?" అంది.

"కమలం నీధోరణి నాకు అర్థం కావడం లేదు. నీ బ్రతుకు తెరువుకి వేరే మార్గం చూచుకోనేదానవు ఇలా మాట్లాడ్డంలో అర్థమేమిటి?" అన్నాడు అయోమయంగా.

"నా బ్రతుకు, దానికి వేరే ఇంకోబాటా కూడానా? నా బ్రతుక్కి ఆ రేళ్ళ క్రితమే ఒక బాట ఏర్పడింది. జీవి తాంతంవరకూ ఇంక అది మారడం కల్ల! కష్టమైనా సుఖ మైనా అందులోనే నా జీవితం అంతమౌతుంది!"

ఇంతవరకూ విషాదచ్ఛాయలమాటున వాడి కృంగి పోయిన రంగారావు ముఖం కొంచెం వికసించింది. ఇంత వరకూ కమలానికి కలిగిన కోపమూ ఆవేశమూ తన స్థితికి పరితపించినందువల్ల కలిగాయని గ్రహించాడు. తనచేత పేకా డడం, అమితమైన ఖర్చు చెయ్యడం మానిపించాలని.

కమలం ఇంత అవస్థపడుతోంది అనుకొన్నాడు" నిజమే, నా ప్రియురాలు. కమలంకోసం నే నాపద్ధని మార్చుకొంటాను" అని రంగారావు నిశ్చయించుకొన్నాడు. కాని—"ఇల్లు అమ్మనిదే అప్పు లెలా తీరతాయి ? ఇల్లు అమ్మి అప్పులు తీర్చాక ఇంక నాకు జీవనాధార మేది ? కమలానికేం ? చక్కని మేడ, పదివేల విలువచేసే బంగారము ఉంది ! ఆ బంగారం అమ్ముకొంటూ తన జీవితమంతా లోటులేకుండా జీవించగలదు. ఒకరిని ఆశ్రయించవలసిన అవసరం కమలానికి లేదు...ఈ మేడ, బంగారము మొదలైనవన్నీ ఈమెకు నేనిచ్చినవే గదా; వీటిని ఆధారంగా చేసుకొని తనతోపాటు నన్నుకూడా పోషించకూడదా, నిజంగా ఈమెకు నామీద ప్రేమవుంటే ? ...... ఛా, ఆడదానికి యిచ్చిన సంపద మళ్ళీ తీసుకొంటానా ? ఆడదాని మోచేతి క్రింది నీళ్ళు త్రాగి బ్రతుకుతానా ? అంతకంటె అడుక్కొని తినడం మేలు ! ... ఐతే, నే నింకేమి చెయ్యాలి ? —" ఏం చెయ్యాలని యోచిస్తే వానికి మార్గమేమీ తోచలేదు. ఇంక కమలం సలహాప్రకారం చెయ్యడంకంటే వేరే మార్గమేమీ లేదని వానికి తోచింది. — "కమలం, నీకు నా సర్వస్వం సమర్పించానని ఇంతకుముందే చెప్పాను. ఇంక నాకు స్వంతబుద్ధి అనేది లేదు. నా శరీరానికైనా నామనస్సుకైనా ఆదేశాల నిచ్చేది నీవే. ఏమి చెయ్యమంటావో నువ్వే చెప్పు." అన్నాడు రంగారావు.

ఇంతవరకూ, లేని కాఠిన్యం, కోపం, తెచ్చుకొని తన హృదయం పరితపిస్తున్నా కమలం పరుషంగా మాట్లా

డింది. ఇంక తన రంగా సరియైన మార్గంలోకి వస్తాడనే విశ్వాసం కలగ్గానే తన కృత్రిమ కంఠాన్ని కృత్రిమాకృతిని విడిచిపెట్టింది. మెల్లగా కుర్చీలో కూర్చున్న రంగాని సమీపించింది. వాని తల నిమురుతూ "రంగా, నన్నిలా యేడిపించడం నీకు భావ్యమే ?" అంది గద్గద కంఠంతో. ఆమె కళ్లు అశ్రువులతో నిండిపోయాయి.

రంగారావు ముఖమెత్తి ఆశ్చర్యంతో ఆమెవైపు చూచాడు. "నిన్ను యేడిపిస్తున్నానా ? నేను" అన్నాడు జాలిగా.

"సంపదంతా పాడుచేసుకొని బికారివైతే నాకు యేడుపు కాదూ ?"

"ఏదో కొద్దిమొత్తంప్పై ప్రైవాటికి ఖర్చుపెట్టినా, నా ఆస్తంతా ఈమెకోసమే ఖర్చుపెట్టానే. చీరలు కొన్నాను, నగలు చేయించాను, మేడ కట్టించాను. అన్నీ ఈమెకోసం ఖర్చుచేస్తే. ఖర్చుచేసి నన్నేడిపిస్తున్నా నంటుందేమిటి ?" అనుకొని ఆశ్చర్యపోయాడు రంగారావు. "నా సంపదలో చాలభాగం నీకోసమే ఖర్చుచేశాను ఏడిపిస్తున్నా నంటా వేమిటి ?" అన్నాడు.

"ఔనులెండి, మీరు నన్ను అంతవరకే అర్థం చేసుకొన్నారు. నేను ఎప్పుడైనా ఏదైనా కావాలని మిమ్మల్ని కోరానా ? కొంచెం జ్ఞాపకం తెచ్చుకోండి ! మీకు మీరే నాతో చెప్పకుండా చీరలో, నగలో తెస్తూ నన్ను అలంకరిస్తూ వచ్చారు. వద్దని ఎన్నివిధాలచెప్పినా విన్నారా? మేడ వద్దు మహాప్రభో, అంటే విన్నారా ? ఇరవైవేల రూపా

యలు దానికి ఖర్చుచేశారు. పైగా ఇంకో పదివేలు మేడ లోని సామాను, కర్రా బుర్రా చెప్పా చేంతాడూ కొని పడేశారు. మళ్ళీ సొమ్మయేవి వీటిలో ఎన్ని ఉన్నాయో చెప్పండి. ఎంతడబ్బు వృథాగా ఖర్చయి పోయిందో యోచించండి. ఇప్పుడు వాటినిఅమ్మజూపితే పదిరూపాయల దానికి ఐదురూపాయలైనా రావు."

కమలం చెప్పిన మాటలన్నీ సత్యమే! ఈవిధంగా ఖర్చుపెడితే రంగారావు ఆస్తి ఎంతో కాలం నిలువదని ఆమె ఊహించింది. ఆ తరువాత తనవద్దనున్న నగలతోను డబ్బు తోను తా మిద్దరూ జీవించవలసివస్తుందని ఆమెకు తెలుసు. రంగా చేతులలోని సంపదంతా సమాప్తమయేలోపున వాని మనసు మార్చి మంచిమార్గంలో పెట్టాలి. లేనియెడల బల వంతంమీాద తనవద్ద నున్నదికూడా తీసుకొని దుబారాగా ఖర్చు చేసెయ్యవచ్చునని ఊహించింది. అందుచేతనే ఆమె భవిష్యత్తును చక్కగా ఊహించి ఆమె వాని ఆస్తిలోని కొంత భాగాన్ని ఎప్పటికప్పుడు బంగారం రూపంలోనూ రొఖ్ఖం రూపంలోనూ జాగ్రత్తచేసింది. మేడకీ, అందు లోని సామానుకీ పేకాటకీ ఖర్చుచేసినది మాత్రం ఆమె దృష్టిలో వ్యర్థమనిపించింది. ఎప్పటికప్పుడే ఆమె వాని ఖర్చుల్ని వారిస్తూ వచ్చింది. నేను కొన్నవి నచ్చనికారణం చేత అలా అంటోందనీ ఇంకా గొప్పవి కొని ఆమెను సంతోషపెట్టాలని రంగారావు అనుకొనేవాడు. రోజురోజుకీ ఆమెను క్రొత్తరకపుచీరలతోనూ నగలతోనూ అలంకరిస్తేనే గాని వానికి తృప్తిగాను ఆనందంగాను ఉండేదికాదు.

"ఈమె పైకి ఇలా అంటుందిగాని మనస్సులో సంతోషిస్తూనే ఉంటుంది. ఈవిధంగాచేస్తూ ఉంటేనేగానీ ఈమెకు నామీద మక్కువ నిలువదు" అని అనుకొనేవాడు.

కాని రంగారావుకి ఈనాడు కమలం పూర్తిగా అర్థమయింది. ఆమె తన జీవితంలో కష్ట సుఖాలతో గాఢంగా పెనువేసుకొనిపోయిన వనితా శిరోమణి, అర్ధాంగి, సహచరణి అని పిలువబడే భార్యకూడా తన భర్తజీవితంలో ఇంతగా కలసిపోవడం అసంభవ మనిపించింది. ఆమెనుగురించి ఇంకా, గంభీరంగాఆలోచిస్తే కమలాన్ని కామించడం. ప్రేమించడం చాలదు. ఆమెను ఆరాధించాలి, ఆమె పాదాలదగ్గర మోకరిల్లి ప్రణామం చెయ్యాలి, అని వానికి తోచింది. చిన్ననాటినుండి నేటివరకు తన జీవితం, తన ప్రవర్తన, అంతా విమర్శించుకొన్నాడు. తనలోని మంచిచెడ్డల్ని గ్రహించుకున్నాడు. ఇంక కమలం తన జీవితానికి ధ్రువ జ్యోతి, ఆరాధ్యదేవత అనుకొన్నాడు. తన ప్రవర్తనకి పశ్చాత్తాపము, కమలాన్ని ఇంతవరకూ అర్థం చేసుకోకుండా ఉన్నందుకు ఆవేదన, కమలం అంతటి మహత్తర వ్యక్తి తనదికదా అన్న సంతోషం, వానిని ఉక్కిరి బిక్కిరి చేశాయి. అశ్రుసిక్త నయనాలతో లేచి ఆమె కెదుట నిలబడ్డాడు—"కమలం, నిన్ను అర్థం చేసుకోన లేకపోయిన మూర్ఖుణ్ణి నన్ను మన్నిస్తావా ?" అని గద్గద కంఠంతో అన్నాడు.

చిరునవ్వుతో, నిండిన కళ్ళతో, వణికే పెదవులతో, ఎర్రపెక్కిన కపోలాలతో ఒకసారి కమలం రంగా కళ్ళలోకి

చూచింది. వాని నోటికి చెయ్యి అడ్డం పెట్టింది. వాని భుజాలమీద చేతులువేసి వాని వక్షంలో తనతల చేర్చింది.

# 17

శంకరశాస్త్రిగారు, వారిభార్య, తమ కూతురు స్థితికి కొన్నాళ్ళు బాధపడ్డారు. ఆతరువాత, "దాని ఖర్మ మలా ఉంటే మనమేం చెయ్యగలం ? మన లోపంలేకుండా అన్ని విధాలా అనుకూలమైన సంబంధమే చేశాం. ఇంత విపరీతం జరుగుతుందని కలలోనైనా తలచామా ? దైవం ప్రతికూల మయాడు దానిపట్ల" అని దైవానికి కర్మకూ సరస్వతిని ఒప్ప గించి తృప్తిపడ్డారు. ఒకటి రెండు రోజులు తల్లితోపాటు ఏడ్చి "ఇంక నాకు భర్త లేడు ! ఇంక నా బ్రతుకింతే ! నా ప్రారబ్ధ మిలా ఉంటే ఎవరేం చేస్తారు ?" అని గుండె రాయిచేసుకుంది సరస్వతి.

ఇప్పుడు యవ్వనం ఆమె ప్రతి అవయవమునుండీ తొంగి చూస్తోంది. ఆరోగ్యవంతమైన ఆమె శరీరం, అవ యవ సౌష్ఠవంతో ఆకర్షణీయంగా ఉంది. బంగారుఛాయతో బింకంగా, నున్నగావుండే ఆమె ప్రతీ అంగమూ యవ్వన మదాన్ని వెల్లడిచ్చూ ఉన్నాయి.

రంగారావు విడాకు లివ్వనంతవరకూ వానిని గురించి తీయతీయని కలలు కంటూ కాలక్షేపం చేసింది సరస్వతి. ఇంక ఇప్పుడామెకు వాని ఆశ పోయింది. ఆమె కలలన్నీ

కల్ల లయినాయి. జీవితాంతంవరకూ నాగతి యింతే అని అని ఆమె నిరాశ నిస్పృహాలతో రోజులు దొర్లిస్తోంది.

ఒకనాటి మధ్యాహ్నం సరస్వతి యింటికి మేనమామ కొడుకు, ఆనందం వచ్చాడు. ఆనందం విశాఖపట్నంలో ఇంటర్ మీడియట్ చదువుతున్నాడు. సరస్వతికంటె ఒక సంవత్సరం చిన్నవాడు. వేసంగి సెలవుల్లో ఓసారి మేనత్తను మేనత్త కూతురు సరస్వతిని, చూచిపోదామని వచ్చాడు. ఇంతకుముందు సరస్వతి స్థితినీ కొంతవరకూ అతను విని యున్నాడు. ఇప్పుడు సరస్వతిని చూచాక ఇలాంటి పిల్లకు విడాకు లిచ్చినవాడు పరమ నిర్భాగ్యు డనుకొన్నాడు.

సరస్వతి ఆనందాన్ని తన పెళ్ళికి వచ్చినపుడు చూచింది. అంతకుముందు, చిన్నప్పుడు ఇద్దరూ కలసి మెలసి ఆటపాటలతో కాలక్షేపం చేసేవారు. పొట్టిలాగు, బొత్తాలులేని చొక్కా, చింపిరిజుట్టుతోనూ, చీమిడి ముక్కుతోనూ ఉండే ఆనందం ఇప్పుడు మడత చెరగని పంట్లాము, చొక్కా, కాలికి మేజోళ్ళు, బూట్లతోనూ నూతన యవ్వనం తోనూ నీటుగా గోటుగా ఉన్నాడు. ఈ మధ్యకాలంలో ఆనందమంటే ఏమో మరచిన సరస్వతిలో ఆనందం రాక వినూత్న ఆనందరేకల్ని వికసింపజేసింది. "ఆనందం! ఎంతగా మారిపోయావు? పెద్ద మగాడివై పోయావే!" అని నవ్వుతూ పలుకరించింది.

"నువ్వుమాత్రం మారిపోలేదూ! వసంతకోకిలలా మరించిపోయావు!" అని అందామనుకొన్నాడు ఆనందం.

కాని ఇంతలో ఆమె స్థితి వాని తలపుకి వచ్చింది. ఏమీ సమాధానమివ్వక పెదిమలతో చిన్నగా నవ్వి ఊరకున్నాడు.

ఆనందానికి స్నానం, భోజనం మొదలైనవన్నీ తల్లి ప్రక్కనుండి యెంతో ఉత్సాహంతో అమర్చింది సరస్వతి.

ఇపుడు, సరస్వతి చూచినది మొదలు, ఆమెను గురించిన చింత ఆనందం మనస్సులో పొగమంచులా ఆవరించింది. పేరు పేరున అందరి క్షేమసమాచారాలు అడిగిన అత్తకు, మామకు క్లుప్తంగా జవాబు లిచ్చాడు. "మామయ్య పరమ ఛాందసుడు. భర్త విడాకులిచ్చివేసినా కూతురుకి మళ్ళీ పెళ్ళి చెయ్యడు. దీని యవ్వనమూ సౌందర్యమూ ఇలా అడవిపాలు కావలసిందేనా ? ఏమైనాసరే, దీనికి మళ్ళీ పెళ్ళి చేయించే ఏర్పాటు చెయ్యాలి" అనుకొన్నాడు.

భోజన మయ్యాక, "కాస్సేపు పడుకోరా, తిరిగి తిరిగి వచ్చావు" అంది అత్తయ్య.

వెంటనే సరస్వతి హాలులో మంచం వాల్చి పక్క వేసింది. ఆనందం పడున్నాడు. బయట యెండ మండుతు పోతూన్న కారణంచేత అందరూ కాసేపు నడుం వాల్చారు, సరస్వతికి మాత్రం నిద్ర పోవాలని లేదు. హాలులోని పడక కుర్చీలో కూర్చుంది. అప్పుడే నిద్రపోతూ ఉన్న ఆనందాన్ని తనివితీరా చూడాలనే అభిలాషయే దీనికి కారణం. ఆహాల్లో ఇంకెవరూ లేరు. తల్లి వంటింటి గడపమీద తలపెట్టి నిద్ర పోతోంది. శంకరశాస్త్రిగారు గదిలో మంచంమీద గుర్రు పెట్టి నిద్రపోతున్నారు.

సరస్వతి ఆనందాన్ని రెప్పవాల్చకుండా చూస్తోంది. ఎర్రగా కొంచెం కోలగా నిండుగా ఉన్నవాని ముఖము, ముకుళించుకొనియున్న గులాబిరేకుల్లాఉన్న వాని కను రెప్పలు, తీర్చి దిద్దినట్లున్న వాని కనుబొమలు, సన్నగా విశాలంగా ఉన్న వాని నుదురు, నూనూగు మీసాలు, వాటికి దిగువను ముద్దు పెడుతూన్నట్లున్న పెదిమలు, ఎత్తుగా ఎగసి పడుతూన్న వాని ఛాతీ—ఇలా వాని ప్రతీ చిన్న అవయవాన్ని సరస్వతి పరిశీలనగాచూస్తోంది. రెప్పల మాటునుండి వాని కళ్ళు తన్ను చూస్తోన్నట్లు భావించుకొని సిగ్గుపడింది. ఆమె పెదిమలనుండి వెలువడే ముద్దు తనకే అనుకొని ఊట లారింది. "ఆ ఛాతీ కఠినంగా, గాఢంగా తన ఱొమ్మునుచేరితే...? నుంచంమీద పరుపు చుట్టి పడేసినట్లు ఆ ఛాతీని తన గుండెలమీద దభీమని పడేస్తే ? ...దెబ్బ తగులుతుందా ?...ఛా ! దెబ్బ తగలడమేమిటి ? ఆనందంగా సుఖంగా కసితో గెంతులేస్తుంది నాహృదయం" ఇలా అనుకొని ఒకసారి తన రెండు అరచేతులతోను తన వక్షాన్ని గట్టిగా నొక్కుకుంది. ఆమెకు శరీరమంతా విద్యుత్తు ప్రవహించి నట్లయింది ఒడలంతా పులకరించింది. హృదయం, కొలిమి తిత్తిలా బుస్సు బుస్సు మంటోంది. ఆమె కుర్చీలో కూర్చులేకపోయింది. లేచి నిలబడి, మళ్ళీ ఒకసారి నిద్రిస్తూన్న ఆనందాన్ని చూచింది. ఆ ముఖాన్నీ, ఆ ఛాతీని, ఆ చేతుల్ని మనోఫలకంమీద గాఢంగా చిత్రించుకొని ఆ రూపాన్నే భూమధ్యమున నిలుపుకొని రెండడుగులలో వెళ్ళి గదిలోని పరుపుమీద బోర్లాపడింది.

తలగడను జోమ్ముక్రింద పెట్టుకొని పరుపును కావలించు కొంది—"ఆనందానికింకా పెళ్ళి కాలేదు. ఆనందంతోనే తన పెళ్ళి జరిగిఉంటే ?...ఇవేళ వచ్చినట్లు చుట్టపు చూపుకోసం వస్తాడా ?..."నా సరస్వతీ ! నా ముద్దుల సరస్వతీ !" అంటూ కోరికలతో గలగల్లాడే మనసుతో, ఉ్రరూతలూగే హృదయంతో, ఉద్వేగంతో, ఉద్రేకంతో వచ్చేవాడు. వచ్చీరాగానే నన్ను గదిలో కలుసుకొని వెర్రి ఆవేశంతో నన్నూ హృదయానికి చేర్చుకొని, ముద్దులతో నా ముఖమంతా తడిపివేశాడు. పోనీ, ఇప్పుడైతేయేం ?... వాడికింకా పెళ్ళి కాలేదు గనుక, నన్ను పెళ్ళాడి ఆయన విడాకు లిచ్చేశాడు గనుక, మా యిద్దరికీ పెళ్ళయితే ?... ...నాకు మళ్లీ పెళ్లి ! ఛా, ఛా ! ఎంత నీచం ! ఎంత పాపం ! ఎంత అప్రతిష్ఠ ! ... "

"ఐతే, మా పెద్ద పాలేరుపెళ్ళాం, వాణ్ణి మారు మనువు చేసుకుందిట ! వాళ్ళకి లేదాపాపం ? వాళ్ళకి అప్రతిష్ఠ యేమీా రాలేదే ? ..."

"వాళ్ళకీ మాకు తేడాలేదూ ? వాళ్ళు నీచకులం వాళ్ళు ! వాళ్ళకీ మానం, అవమానం, గౌవరం అగౌరవం, ఉచ్చం నీచం, పాపం పుణ్యం అనేవి ఉండవు! మరిమేమో? ...మా ముత్తాతగారు యజ్ఞం చెశాట్ట ! మా తాతగారు వేదశాస్త్ర పండితుట ! మా నాన్నకూడా వేదమూ శాస్త్రము చదువుకున్నవాడే ! అందుచేతనే ఊళ్ళో అందరూ మా నాన్నని గౌరవిస్తారు. ఇలాంటి గౌరవమైన కుటుంబంలో పుట్టినదాన్ని ! ఛీ ! నాకీ పాడుతలపులేమిటి?"

అని వివిధములైన ఆలోచనతో ఒక గంటసేపు అలాగే పడుకుంది సరస్వతి. తరువాత ప్రకృతికి వచ్చి లేచింది. తండ్రి గురక వినిపిస్తోంది. తల్లి ఇంకా వంటింటి గుమ్మంలో అలాగే పడుంది. ఆనందం ఇంకా లేవలేదు. ఈ సదవ కాశాన్ని ఊతగా గొని ఆమె మనస్సు మళ్ళీ చలించింది. గుండె గుబగుబలాడింది. మళ్ళీ కాస్సేపు కుర్చీలోకూర్చుని ఆనందాన్ని చూడాలనే అభిలాష ఆమెలో ఒకే ఒక క్షణంలో మొలకెత్తి, చిగిర్చి, పుష్పించి, ఫలించింది. "ఒక్కసారి కన్నుల కరవుదీరా చూస్తాను ! చూస్తే తప్పే ముంది ? ఎంతమంది ఆడాళ్లు, మగాళ్ళని, మగాళ్ళు ఆడా ళ్ళని చూడ్డంలేదు ?" అనుకొని మనసు తృప్తిపరచుకొంది.

నెమ్మదిగా వచ్చి మళ్ళీ హాలులోని కుర్చీలో కూర్చుంది. ఆనందం ఇంకా అలాగే వెల్లకిలా పడున్నాడు. నుదుటను చెమట బిందువులు మెరుస్తున్నాయి.

"అయ్యో, పాపం, చెమటపట్టిందే ! ఈ యెండకి ఉక్కిపోతున్నాడు ! ఓసారి నా పమిట చెంగుతో ఒత్తితే? విసనకర్రతో విసరితే...?... నిద్రలోనే ఆనందం అనుభ విస్తాడు ! ఏ నందనవనంలోనో విహరిస్తూన్నట్లు, మలయ మారుతంలో తేలిపోతూన్నట్లు కలగంటాడు ? ... విసిరే దాన్ని నేను గనుక నాతో కలసి విహరిస్తాడా ? ... ఏనా విసరి చూస్తాను, ఏమవుతుందో ! —" అనుకొని విసన కర్రకోసం లోపలికి బయలుదేరింది సరస్వతి.

కుడివైపున గదినుండి తండ్రి గురక వినిపించింది. ఎదురుగా వంటింటి గుమ్మంలో తల్లి కనుపించింది. అంత

వరకూ వెళ్ళి సరస్వతి గటుక్కున ఆగింది. ఆమె కిప్పటికి నిజస్థితి జ్ఞప్తికి వచ్చింది. యవ్వనోన్మాద మంటారే — అలాంటి దేదో ఆమె నొక నిమిషం ఆవహించి వదలి పెట్టింది!—"అమ్మో! అమ్మగాని, నాన్నగాని చూస్తే ఇంకేమైనా ఉందా ?...నేను పెళ్ళయినదాన్ని ! వయస్సు వచ్చినదాన్ని ! ఆనందం మాత్రం కుర్రాడా ! మేనమామ కొడుకైతేమాత్రం ? వాడికి విసనకర్రతో విసరానంటే, పమిటకొంగుతో చెమట ఒత్తానంటే చంపెయ్యరూ ? ... వాడు పన్నెండేళ్ళ చిన్నవాడూ నేనో పదేళ్ళ చిన్నదాన్నీ, ఐతే ఎంత బాగుండును ? ప్రేమగా, జాలిగా వాడి ముఖం చూస్తూ ప్రక్కను నిలబడి నెమ్మదిగా విసరేదాన్ని!" అనుకొంటూ హాలు గుమ్మం దగ్గర నిలబడి పోయింది.

"ఒసేవ్, కొంచెం మంచినీళ్ళియ్యి !" అని గది లోంచి వచ్చిన తండ్రి కంఠం విని సరస్వతి ఉలికిపడింది. ఒక క్షణం ఆమె గుండె దడదడ లాడింది. వెంటనే కుదుటబడి "తెస్తున్నా నాన్నా !" అని నెమ్మదిగా తండ్రికి జవాబిచ్చి వంటింట్లోంచి మంచినీళ్ళు తెచ్చి తండ్రికి యిచ్చింది.

"నువ్వు పడుండలేదమ్మా ?" అంటూ మంచినీళ్ళు త్రాగి ఆమె సమాధానం ఆశించకుండానే మళ్ళీ పడున్నాడు శంకరశాస్త్రిగారు.

తండ్రి గదిలోంచి బయటికివచ్చి సరస్వతి వాకిట్లో కాస్సేపు తచ్చాడింది. మళ్ళీ తండ్రి గురక ఆమె చెవుల బడుతోంది. "ఆఁ, బాగుంది ఈసారి దగ్గరగా వెళ్ళి కన్నుల పండువుగా చూస్తాను ఆనందాన్ని !" అనుకొని సరస్వతి

హాలులోకి వెళ్ళింది. 'కారణం లేకుండా మంచందగ్గిర నిల
బడి చూడడ మెలాగ ?' అని ఆలోచించింది.

మంచానికి ఒక ప్రక్క గోడకు అలమారు ఉంది.
అందులో బొమ్మలూ లక్కపిడతలూ చాలా ఉన్నాయి.
వాటిని సవరిస్తూన్న నెపంతో అక్కడ నిలబడవచ్చు అను
కొని అలమారుదగ్గరికి వెళ్ళింది. తలుపు తెరచి నిలబడి
ఆనందాన్ని తదేక దృష్టితో చూడసాగింది — "ఆనందం
అందంగానే ఉంటాడు! ఎవతో అదృష్టవంతురాలు ఎక్కడో
పుట్టి పెరుగుతోంది వీడిని పెళ్ళాడి సుఖపడ్డంకోసం. చక్కగా
చదువుకొంటున్నాడు; ఉద్యోగం చేస్తాడు. ఓ, ఇంక ఆ,
కట్టుకొన్నదానికి లోటేముంది ? ముద్దినుసు చీరలూ నగ
లూనూ ! తనివితీరా ముద్దులూ కౌగిలింతలూను !
మొగుడూ పెళ్ళాం ఆనంద డోలికల్లో ఊగుతారు! ప్రణయ
తరంగాల్లో మునిగి తేలుతారు ! కాని ఆ వచ్చే భార్య వీనికి
విడాకు లిచ్చేస్తే ?... అలా ఎందుకు జరుగుతుందీ ?
వీడికేం లోటు మన్మథునిలా ఉన్నాడు ?... మరి నాకు
మాత్రం లోటేమిటి? నేను బాగు లేనూ? 'నీకేం లోటమ్మా
సాక్షాత్తు సరస్వతీ దేవిలా ఉన్నావు' అంది మా పెద్దమ్మ !
ఇంత అందంగా ఉన్నా ఆయన నాకు విడాకులిచ్చి వది
లేయలేదూ ?... ఏదో చిన్న కారణం, దానికి బ్రహ్మాండ
మంత కోపం ! అంతే, ఇంక విడాకులే !... సరే, ఆనందం
పెళ్ళాం వాడికి విడాకు లిచ్చేస్తుం దనుకొందాం. అప్పుడేం
జరుగుతుంది ? నాకులాగే వీడి వయసూ సొగసూ మనసూ,
అన్నీ వ్యర్థమై పోతాయా ? వీళ్ళకేం మగాడు ! వెంటనే

ఇంకోదాన్ని, దానికంటే అందమైనదాన్ని చూసుకొని పెళ్లి చేసుకొంటాడు. ఎన్నిసార్లు ఎంతమందిని పెళ్ళాడితే మాత్రం ఏం ? మగాడికి అప్రతిష్ఠ యేమీ లేదుగా? కాని, ఎవతెనో కాకుండా నన్నే పెళ్ళి చేసుకొంటే ? ... భలేగా ఉంటుంది జోడా ! ... విడాకు లిచ్చినదాని మొగుడు, విడాకులిచ్చిన వాని పెళ్ళాం; ఇద్దరూ సంసారం చేస్తారు ! కాని వీడు నాకంటె వయసులో చిన్నవాడైపోయాడే ! లోక విరుద్ధంగా ఉండదూ మా దాంపత్యం ? ... ఐనా మామతి మండ వీడు నన్ను చేసుకొంటానంటే మాత్రం మానాన్నా అమ్మా ఒప్పుకోవద్దూ ! నా పెళ్ళిమాట ఎత్తినవాడి పీక అమాంతంగా నులిమేస్తాడు మా నాన్నగారు ! ... పెళ్ళి కాదుగాని చడీచప్పుడూ లేకుండా ఓరాత్రివేళ వీడూ నేనూ మద్రాసు పారిపోతే ? ... " అనే తలపులతో తన్మయు రాలయి నిలబడి ఉంది సరస్వతి.

"సరస్వతి, ఇక్కడ నిలబడి ఏం చేస్తున్నావ్?" అని ఆనందం కళ్లు నులుముకొంటూ లేచి కూర్చున్నాడు.

సరస్వతీ శరీరం ఒక్కసారె కంపించిపోయింది. ఆమె భావనామాత్రం తెగిపోయింది. బెదురుగా అటు నిటు చూస్తూ కంగారుగా అలమారులో చెయ్యిపెట్టి ఏదో సర్దుతూన్నట్లు నటింపసాగింది. తొట్రుపాటుతో కంపించే ఆమె చేతులకి తగలి రెండులక్కపిడతలు క్రిందపడి చప్పుడు చేశాయి. బిత్తరచూపులతో తొందరపాటుతో సరస్వతి వాటిని తియ్యడానికి వంగింది, వాటిలో ఒకటి తూలి దొర్లి, ఆనందం మంచంక్రిందికి వచ్చింది. వాని మంచంక్రింద ఉన్న

లక్కపిడత తియ్యడానికి ఆమెకు ధైర్యం చాలలేదు. ఒకసారి ఆనందం కళ్ళలోకి చూచి సిగ్గుపడి తలవంచుకొంది. ఆనందం నవ్వుతూ లక్కపిడత తీసి ఆమె చేతిలో పెట్టబోయాడు. ఆమె చెయ్యి చాచలేకపోయింది. మళ్ళీ ఒకసారి వాని ముఖం చూచి 'దానిలో పెట్టు' అని అలమారు చూపించింది.

ఆనందం లేవలేదు, లక్కపిడతను మంచంమీద పడవేసి—'అవి తరువాత సవరించవచ్చుగాని, ఇలా కూర్చో, నీతో కొంచెం మాట్లాడాలి' అన్నాడు.

"అమ్మో, మంచంమీదే! నీ ప్రక్కనే! కొంప ముంచేస్తావురోయ్" అని మనసులో అనుకొని "కూర్చో నక్కరలేదులే. నువ్వు మాట్లాడదలచిందేమిటో మాట్లాడు" అంది.

"నువ్వు ఎంతవరకూ చదువుకున్నావ్?" అన్నాడు ఆనందం.

"ఊం ఊ! నేనూ నా చదువూను! ఆడపిల్లలకి చదువు కూడదంటారు మానాన్నగారు, మా అమ్మ ధర్మమా అని రెండో క్లాసు చదివాను మాఊరి బళ్ళో! ఆ తరువాత చదవడానికి వీల్లేదని నిషా పెట్టారు మా నాన్నగారు. ఇంక చదువూలేదు ఛట్టుబండలూ లేదు!"

"అరె! చదువుకొంటే ఇప్పుడు నీకెంత ఉపయోగించునో చూడు."

"చదువుంటే నా కుపయోగించేదేమిటిలే! కాలక్షేపానికి ఏదైనా పుస్తకాలు చదువుకొంటూ ఉండేదాన్ని అంతేనా?"

"ఉపయోగం లేకపోవడమేమిటి ? నీ మొగుడు అలా వేదన పనిచేసినందుకు ఏదో చిన్న ఉద్యోగం చేసుకొని స్వేచ్ఛగా నీ బ్రతుకు నువ్వు బ్రతకగలిగేదానివి. 'ఓయి చవటా, నువ్వు లేకపోయినా నాకు లోటులేదు' అని వానికి చెప్పగలిగే దానివి."

"ఛా, నాకు ఉద్యోగమా ? నలుగురూ నవ్వరూ ? ముఖంమీద పేడ్నీళ్ళు చల్లుతారు !"

"ఓసి వెర్రిదానా, ఆరోజులు పోయాయి ! యీ కుగ్రామంలో. మీ ఛాందసపు నాన్న చేతికింద పడిఉన్నావు గనుక లోక మెలా ఉందో నీకు తెలియదు. చదువుకున్న ఆడదానికి ఎంతో విలువవుంది. ఈ రోజులలో నిర్భయంగా నిస్సంకోచంగా ఆడది ఉద్యోగం చేయవచ్చు !"

"సరేలే, ఇక కట్టిపెట్టు నీ ధోరణి. మా నాన్నగారు వింటే నిన్నూ నన్నూ ఛడామడా తిడతారు !"

"మీ నాన్న తిట్లని లెక్కచేసే దెవరే ? ఏమైనాసరే నువ్వు చదువుకోడమో మళ్ళీ పెళ్ళి చేసుకోడమో జరగాలి, మీ నాన్నతో నేను చెప్తా నుండు !"

ఆనందం మాటలు వినగానే సరస్వతిలో అస్పష్టంగా ఆశలు చిగురించాయి. "ఇంత వయస్సు వచ్చాక ఇంక చదువురాదు గాని, పెళ్ళి చేసుకోడమే జరిగితే ! ... " అని ఆమె మనోంతరాళం మూలిగింది. కాని ఆమె ఆశను అక్కడనే అణిచిపట్టి — "చాలు చాలు ! వచ్చినవాడవు వచ్చినట్లుగా గౌరవంగా తిరిగి వెళ్లాలంటే అలాంటి పని మాత్రం చెయ్యకు" అంది నెమ్మదిగా.

"నీ కెందుకు, నువ్వు మాట్లాడకు !" అని ఆనందం మంచంమీదనుండి లేచాడు. సరస్వతి చెంబుతో నీళ్ళు తెచ్చి యిచ్చింది. ఆనందం ముఖం కడుక్కొని ఆమె ఇచ్చిన మంచినీళ్ళు త్రాగాడు.

సరస్వతి తల్లికూడా లేచింది. "వాడికి కాఫీ అలవాటుంది. కుంపటి అంటించి కాఫీకి నీళ్ళు కాచమ్మా !" అంటూ నూతిదగ్గరకి వెళ్ళింది.

సరస్వతి విషయం మామతోనూ, అత్తతోనూ మాట్లాడే అవకాశంకోసం ఎదురు చూస్తున్నాడు ఆనందం. ఆరాత్రి భోజనా లయాక కులాసాగా కూర్చుని శంకరశాస్త్రి గారు తాంబూలం వేసుకొంటున్నారు. ఇంతకంటే మంచి సమయం దొరకదనుకొని ఆనందం మామయ్య దగ్గరకు చేరాడు——

"సరస్వతి విషయం ఏ మాలోచించావ్ మామయ్యా ?" అన్నాడు.

"ఏం చెయ్యమనురా ? ఎలాగయినా అతనూ మార్గంలోకి వస్తాడేమోనని శతవిధాలా ప్రయత్నించాను. వట్టి దౌర్భాగ్యుడై పోయాడు. ఎవతో సంకరజాతి ముండను చేరదీశాడట. ఆస్తి పూర్తిగా హరించిపోయిందట !" అన్నారు శాస్త్రిగారు.

"జరిగిందేదో జరిగిపోయింది. ఇంక అతను మార్గంలో పడ్డం, సరస్వతిని ఆదరించడం అసంభవమైపోయిందిగా ! విడాకు లిచ్చేశాక ఇంక అతను సరస్వతికి మొగుడూకాడు

సరస్వతి వానికి పెళ్ళామూకాదు. ఇంక దీని జీవితానికి మళ్ళీ ఓ బాట చూపించాలి ?"

ఆనందం మాటలు అర్థమయాయికాబోలు, శాస్త్రి గారు తోకత్రొక్కిన త్రాచులా లేచాడు. "అయితే నీ ఉద్దేశం ?" అన్నాడు కోపంతో కళ్లెఱ్ఱజేసి.

ఆనందం జంకలేదు. "లోపమేమిలేని పెళ్ళాన్ని విడిచి పెట్టిన ఇలాంటివాళ్ళకి బుద్ధిచెప్పాలంటే సరస్వతికి మళ్ళీ పెళ్లి జెయ్యాలి" అన్నాడు బింకంగా.

"ఏమిరోయ్, నా కళ్ళముందు పుట్టి నాకే నీతులు చెప్తున్నావ్ ? అలాంటిపని నా బొందెలో ప్రాణ మున్నంత వరకూ జరగదు !"

ఆనందం ఒక నిముషం మాట్లాడలేదు. వాకిటి దగ్గరలో లక్ష్మిదేవమ్మగారు నిలబడిఉంది. గది గుమ్మంలో, సరస్వతి నిలబడింది.

"జరగకపోతే దాని జీవితం ఇలా నాశనం కావలసిందే ?" అన్నాడు ఆనందం.

"దానికేం లోటురా ? మా కింకెవరున్నారు ? మా ఆస్తిఅంతా దానిదే !"

మామయ్య మాటలకి ఆనందానికి నవ్వూ వచ్చింది. విచారమూ కలిగింది—భర్తలేని జీవితం ఆడదానికి ఎంత దుర్భరంగా ఉంటుందో కొంచెంఆలోచించు మామయ్యా!"

"మొగుడు పోయిన వాళ్ళేం జేస్తున్నారు ? ఆ దృష్టి పెట్టుకొంటే బాధగానీ, మొగుడే లేడనే భావంతో ఉంటే ఏబాధా లేదు. దైవం ప్రతికూలమైతే ఏం జేస్తాం.

గుండె రాయి చేసుకోవడమే !" మొగుడులేని ఆడదాని కష్టం కొంచెం ఆలోచించారు కాబోలు, శాస్త్రిగారి కోపం కొంచెం చల్లారింది. కంఠస్వరం తగ్గింది.

"బుద్ధిపూర్వకంగా మనం చేసే పనులకి దేవునిమీద భారం వెయ్యడం న్యాయంకాదు మామయ్యా ! సరస్వతి లాంటి వాళ్ళకి పెళ్ళి చెయ్యవద్దని దేవుడు ఆజ్ఞాపించాడా? పెళ్ళిచేస్తే దేవుడు శిక్షిస్తాడా ?"

"నిన్నగాక మొన్న పుట్టినవాడవు, నీకు అశుభం, శుభం ఏమి తెలుసురా ? నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్చుకొని ఇలాంటి కారుకూతలు, కూస్తుంటావు మీరు. ఇంక కట్టిపెట్టు ! నాదగ్గర ఇలాంటి ప్రసంగ మెప్పుడూ ఎత్తకు. నేను హర్షించేవాడిని కాను !"

ఇంక మామయ్యకు ఏమి చెప్పాలో అర్థం కాలేదు ఆనందానికి—"ఈ కూపస్థ మండూకాలికి, ఈ ఛాందసులికి ఏమి జెప్పినా లాభంలేదు. మనకి చేతనైతే వీళ్ళతో చెప్ప కుండా సంప్రదించకుండా వీళ్ళని లెక్కచెయ్యకుండా మన మనస్సుకి ధర్మమని తోచినదానిని చేసివెయ్యడమే మార్గం!" అనుకొని ఆనందం ఇంక ఆ ప్రసంగం కట్టిపెట్టాడు.

నాల్గు రోజులపాటు ఉండి పోదామని వచ్చిన ఆనందం ఆ మరునాడే తిరుగు ప్రయాణ మయ్యాడు, సెలవురోజులు గనుక ఓ వారంరోజు లుండి వెళ్ళమని మామ అత్త యథా లాపంగా అన్నారు. వాని మాటలు, సరస్వతి విషయంలో అత డిచ్చిన సలహా, వారికి ఏహ్య మనిపించాయి. సెలవు

లన్నీ ఇక్కడ గడపమని సరస్వతి చాటుగా ప్రాధేయపడి పడ్చింది.

"నేను ఇక్కడ ఉండడంగాదు. నువ్వు వచ్చి మా యింటిదగ్గర ఉంటువుగాని. నేను వెళ్ళి మా నాన్న చేత ఉత్తరం వ్రాయిస్తాను. తప్పకుండా రావాలి సుమా!" అని రహస్యంగా చెప్పి ఆనందం వెళ్ళిపోయాడు.



మరి నాలుగు రోజులకు ఆనందం తండ్రి, వెంకట రత్నంగారు వచ్చారు' సరస్వతి ప్రారబ్ధానికి ఆయన చాలా వగచారు, "సరస్వతిని నాతో పంపించండి ఓ నెల రోజులు మా యింటిదగ్గర ఉండి వస్తుంది. ఈ విచారం కొంత మరచి పోతుంది" అని చెల్లెలిని బావగారిని కోరారు.

"ఒక్కగా నొక్క కూతురు. అత్తింటికి వెడితే ఎలా గడిపేవాళ్ళమో గాని దీన్ని విడిచి ఒక్క పూటకూడా కాలక్షేపం చెయ్యడం కష్టమేనోయ్!" అన్నారు శాస్త్రి గారు.

"నిజమే అంత ముద్దుగాను పెంచారు. చివరకా భాగ్యుడు తప్పదోవ పట్టి అందరికీ తీరని వేదన కలుగ జేశాడు. బావా, ఏదో విధంగా సరిపెట్టుకొని సరస్వతిని మా యింటికి పంపించాలోయ్, లేకపోతే విచారంతో పిల్ల కృంగిపోతుంది." అన్నాడు వెంకటరత్నంగారు.

ఆయన చెల్లెలు లక్ష్మీదేవమ్మగారు "ఓ పది రోజుల పాటు పదిమందిలో ఉండి వస్తే ఈ విచారం కొంత మరచి పోతుంది." అని అన్నగారి మాటకు కొంత ఊతనిచ్చింది.

"సరే, తీసుకొని వెళ్ళు" అని "ఇదిగో, బావా! మీ ఆనందంగాణ్ణి కాస్త అదుపాజ్ఞల్లో పెట్టు. లేకపోతే చెడిపోతాడు" అన్నారు శాస్త్రిగారు.

"ఏం, ఏంజేశాడేమిటి? బుద్ధిగా ఉన్నట్టే కనిపిస్తాడే!"

"పైకి అలాగే కనిపిస్తారు కుర్రాళ్ళు. నేనూ అలాగే, ఆనందం చాలా బుద్ధిమంతుడనుకున్నాను. మొన్న వాగిన వాగుడితో తెలిసి వచ్చింది వాడి బుద్ధి"

"అదేమిటి, ఏమన్నాడూ?

"మా తాత తండ్రుల దగ్గర్నుండీ మా కుటుంబ చరిత్ర అంతా నువ్వెరుగుదువుగదా! అగ్రసాంప్రదాయుల్ని అక్షరాలా పాటిస్తూ కర్మిష్ఠినై, వేదమూ, శాస్త్రమూ చదువుకొన్న నేను, నా కూతురికి మారుమనువు చేస్తానా? వాడు విడాకు లిచ్చినందుకే అవమానంతోనూ, సిగ్గుతోనూ తలెత్తుకోలేకుండా ఉంటే సావిత్రికి మళ్ళీ పెళ్ళి చెయ్యి మామయ్యా అంటాడే కుర్రకుంక!"

"వాడి మొహం! వాడికేం తెలుసు బావా? ఎవళ్ళో నీతీ జాతీ లేనివాళ్ళు చేస్తున్నారంటే మనమూ చేస్తామా? ఇంటికెళ్ళి చీవాట్లు పెడతాలే!" అని శాస్త్రిగారిని సముదాయించి సావిత్రిని విశాఖపట్నం తీసుకొని వెళ్లాడు వెంకటరత్నంగారు.

# 18

ఆనందం ఇంటికిపోయి తండ్రి, తల్లి, అన్న, వదిన మొదలైన వాళ్ళ నందరినీ కూర్చోబెట్టి సరస్వతి స్థితిని విచారంగా, బాధగా, కరుణగా చిలవలూ పలవలూ చేర్చి, వర్ణించి చెప్పాడు. మొగుడు వదిలేసినందుకు ఆ సరస్వతి ఏడ్చే ఏడ్పు నేను చూడలేక పోయానన్నాడు. నిజంగా అది కుళ్ళి, కుమిలి కృశించి పోతుందన్నాడు. కొన్నాళ్ళిలాగే ఉంటే దాని ఆరోగ్యం చెడిపోతుందని, మతికూడ పోతుందనీ అన్నాడు. వానిమాటలు విని అంతా విచారించారు. సరస్వతిమీద అందరికీ జాలి కలిగింది. "అయ్యో! పాపం! అలాగటరా!" అన్నా రంతా.

"ఒక్కసారి నువ్వు వెళ్ళి సరస్వతిని తీసుకొని రా నాన్నా! ఇక్కడ ఓ నెలరోజులుంటే ఆ దుఃఖం మరచి పోతుంది" అన్నాడు ఆనందం.

"అలాగే. వచ్చే ఆదివారంనాడు వెళ్ళి తీసుకు వస్తాను" అని చెప్పాడు వెంకటరత్నంగారు.

సరస్వతి పరమానంద భరితురాలై విశాఖపట్నం వచ్చింది. చిన్నతనంలో తనకు పెళ్ళికానిముందు తల్లితో వచ్చినపుడు సరస్వతి విశాఖపట్నం చూచింది. ఆ మేడలు, కార్లు, బళ్ళు, కొండలు, సముద్రతీరం అన్నీ ఆమెకు వింతలే. మామయ్య, అత్తయ్య, నలుగురు బావలు, పెద్ద బావపెళ్ళాం, సరోజినీ, వాళ్ల పిల్లలిద్దరు, వీరందరితో ఇల్లంతా

నిండుగా ఉంది. తమ యింట్లో అమ్మా నాన్నా తనూ తప్ప మరెవరూ లేరు. బిక్కు బిక్కుమంటూ ఉంటుంది తమ యిల్లు. ఇక్కడికి వచ్చిన మొదటిరోజున ఆ జనమూ, కార్లు, బళ్ళు, రైళ్ళు, మేడలు, కొండలు ఆమె మనస్సును కొంత కలవర పెట్టాయి. ఆ మరునాటికి ఆ వాతావరణానికి కొంత అలవాటు పడింది సరస్వతి. ఇంటిదగ్గర ఎప్పుడూ దిగులుగా, జడంగా ఉండే ఆమె మనస్సు ఆ వాతావరణాన్ని చూచి కేరింతలు కొట్టింది. ఆమె ముఖంలో మచ్చునకైనా విషాదరేఖ లేదిప్పుడు. సెలవురోజులే గనుక ఆనందం అస్తమానూ కంటబడుతున్నాడు. బోలెడంత కాలక్షేపం! బ్రహ్మాండమంతటి ఆనందం! సముద్రమంతటి ఉత్సాహం! ఆ నరకకూపంలోంచి స్వర్గంలోకి వచ్చాననుకొంది సరస్వతి.

"ఆనందం ఇంక తన ఉద్దేశాన్ని అసలు జరపాలనుకొన్నాడు వానికి తల్లిదగ్గరకంటే తండ్రిదగ్గర చనువెక్కువ. వెంకటరత్నంగారు పిల్లల్ని ఎప్పుడూ పల్లెత్తుమాట అనడు. వాళ్ళ సంతోష విషాదాలూ ఆటపాటలూ కోపతాపాలూ ముద్దుమాటలూ కొంటెచేష్టలూ వింతగా వేడుకగా సినిమా చూచినట్లు చూస్తా డాయన. వాళ్ళని లాలించడం, ఆడించడం, నవ్వించడం, ఏడిపించడం, పాలించడం అంటే ఆయనకు సరదా. చిన్నవీ పెద్దవీ వాగ్యుద్ధాలు, ఈసడింపులు, చీదరింపులు, బెదరింపులు, బుజ్జగింపులు, లాలింపులు ఆ కుటుంబంలో జరుగుతూనే ఉంటాయి. వాటి నన్నింటినీ ఒక్క మృదువైన మాటతో, ఒక్క చల్లని చూపుతో, ఒక్క నోటిచప్పరింపుతో ఎప్పటికప్పుడే ఆయన వదిలేస్తాడు

ఆయన పి. డబ్ల్యు. డీ. ఆఫీసులో పెద్ద గుమాస్తా. రెండు వందలు జీతం. పెద్దలు సంపాదించిన ఆస్తిమీద ఆయనకి సాలుకి నాలుగువేలు వస్తాయి. పెద్దకొడుకుకూడ ఆయన ఆఫీసులోనే గుమాస్తాగా పని చేస్తున్నాడు. అతనికి నెలకి వందరూపాయలు వస్తాయి. వెంకటరత్నంగారిది చీకూచింతా లేని జీవితం.

ఆనందం ఒంటరిగా తండ్రిని కలుసుకొని—"నాన్నా ఇంక సరస్వతి గతి ఇంతేనా ?" అన్నాడు మెల్లగా.

ఆయన చిన్నగా నవ్వి—"ఏం, ఈ ప్రశ్న నీకెందుకు బయలుదేరింది !" అన్నాడు.

"అబ్బే ! మరేంలేదు. మొగుడు విడాకు లిచ్చేశాడుగా; మరి జీవితమంతా ఇది ఇలా దుఃఖంతో గడుప వలసిందేనా అని."

"వేరే గత్యంతర మేముంది" అని వాని అభిప్రాయాన్ని తెలుసుకొనే కోరికతో వానివైపు చూచారు వెంకటరత్నంగారు.

"చడీ చప్పుడూ లేకుండా ఇక్కడ పెళ్ళి చేసేస్తే ?"

"చేసేస్తే బాగానేఉంటుంది. దీన్ని పెళ్ళాడేవాడు దొరకవద్దూరా ?"

ఆనందం హృదయం ఉరకలువేసింది తన మనోభిప్రాయాన్ని చెప్పేద్దా మనుకున్నాడు. కాని ధైర్యం చాలక మౌనంగా కూర్చున్నాడు.

"నువ్వు ఎరుగున్నవాళ్ళు ఎవళ్ళూ లేరా ? అన్నాడు.

"లేకేం, అనేకమంది ఉన్నారు. కాని అంగీకరించే వాళ్ళు కావాలి !"

"ప్రయత్నంచేస్తే నీకు దొరక్కపోరు నాన్నా !"

"నువ్వు చెప్పేదాక ఆగాననుకుంటున్నావురా ? సరస్వతిని ఇక్కడికి ఎందుకు తీసుకొని వచ్చా ననుకుంటున్నావ్ ? యోగ్యుడైనవాణ్ణి చూచి పెళ్ళి చేసేద్దామనే ప్రయత్నం చేస్తున్నారా."

"తానే పెళ్ళాడతానని చెప్పడానికి ఆనందానికప్పుడు ధైర్యం చాలలేదు. నాన్న అంటే ఎంత చనువున్నా తన పెళ్ళివిషయంలో వానికి బిడియం కలిగింది. ఒకసారి పెళ్ళయిన సరస్వతిని, తాను పెళ్ళి చేసుకుంటానంటే నాన్న ఏమంటాడో అన్న భయంకూడా కలిగింది. ఇలా ఎదురుగా నిలబడినోటితో చెప్పడం కష్టమని వానికితోచింది. అప్పటికింక ఏమీ మాట్లాడకుండా తండ్రి ఎదుటినుండి వెళ్ళిపోయాడు.

వెంకటరత్నంగారు రాత్రి భోజనంచేసి వాడుక ప్రకారం కాస్సేపు చదువుకోడానికి డ్రాయరుమీద ఉన్న భాగవతగ్రంథం తీశారు. దానిక్రిందనే ఉన్న చీటీ ఆయన కంటబడింది. ఆ చీటిమీద "నేను సరస్వతిని పెళ్లి చేసుకుంటాను. ఆనందం" అని వ్రాయబడిఉంది.

"అరి భడవా !" అని వెంకటరత్నంగారు నవ్వుకొన్నారు. "ఆనందం" అని పిల్చారు.

ఆయన పుస్తకం ఎప్పుడు తీస్తాడా, ఆ చీటి ఆయన కంటికి ఎప్పుడు కనబడుతుందా, అని చాటుగా ఉండి కనిపెడుతూన్న ఆనందం ఆయన గదిలోకి వచ్చాడు;

"ఇలా రా" అని వెంకటరత్నంగారు వానిని నెమ్మదిగా దగ్గరకు పిలిచారు. "నీ కింకా లోకజ్ఞానం తక్కువ; ఇలాంటి ఉద్దేశం కూడదు నాయనా !" అన్నాడు లాలిస్తూ.

"ఏం !" అన్నట్లు తలెత్తి చూచాడు ఆనందం.

ఎందు కంటావా, అది నీకంటే పెద్దది. ఒకసారి పెళ్ళయినది. ఏ రెండో పెళ్ళివానినో చూచి దానికి పెళ్ళి చేసేద్దాం. నీ వుద్దేశం మార్చుకో బాబూ !" అన్నారు మెల్లగా.

ఇంక ధైర్యం తెచ్చుకొని మాట్లాడితేనే గాని లాభం లేదనుకొన్నాడు ఆనందం — "పెద్దా చిన్నా లెక్కేమిటి నాన్నా ? దానికంటే పొడవుగా బలంగా ఉన్నానుగా నేను ? ఐనా దానికీ నాకూ ఒక సంవత్సరమేగా తేడా ? ఇతర దేశాల్లో మగవాడు తనకంటె పదేళ్లు పెద్దయినదాన్ని కూడా పెళ్ళి చేసుకుంటాడు" అన్నాడు తన స్కూలు విజ్ఞానాన్ని ఉపయోగిస్తూ.

"అదికాదు బాబూ, మనం ఎంత ముందుకిపోయినా మనకొక సభ్యత, నాగరికత ఉన్నాయి. తనకంటె పెద్ద దాన్ని పెళ్ళి చేసుకోవడం మన ఆచారానికి విరుద్ధం. సరస్వతికి పెళ్ళయింది. పునస్సంధానంకూడా అయింది. ఇది నీలాంటి శుద్ధ బ్రహ్మచారికి ఎంతమాత్రం తగదు. నీలాగే పవిత్రమై రూపము, గుణము కలిగిన కన్యను నీవు వివాహం చేసుకోవాలి. ఈ సెలవులు పూర్తిగాకుండా అలాంటి పిల్లను చూచి నీకు పెళ్ళి చేస్తాం ! నీ ఉద్దేశం మార్చుకో నాయనా !" అన్నారు.

ఆనందానిది ఇంకా అపరిపక్వ హృదయం. పుస్త కాల్లో చదివినవి, సభలలో విన్నవి, సినిమాలలో చూచినవి అన్నీ యథార్థా లనుకొనే స్థితిలో ఉన్నాడు. ఏవేవో ఆద ర్శాలు, ఆవేశాలు ఉన్నాయి వాని మనస్సులో. వాటిని తాను అనుసరించి అమలు జరపాలని కుతూహల పడతాడు. అతను సరస్వతి స్థితిని విన్నాడు. ఆమెను చూచాడు. ఆమె మీద వానికి జాలి కలిగింది. ఇలాంటి వాళ్ళకి మళ్ళీ పెళ్ళి చెయ్యాలనే ఆదర్శం వాని మనస్సులో ఇంతకు ముందు నుండీ ఉంది. దానిని తాను ఆచరణలో పెట్టాలనే ఉత్సాహం వానికి కలిగింది. అందుకు తగిన ప్రయత్నం చేశాడు. అత నికి సరస్వతిమీద జాలి. ఆమెయందు సానుభూతి కలిగాయి. లోకానుభవం తక్కువ గనుక వానిలో ఆలోచించడంకంటే ఆవేశపడడం ఎక్కువ. ఇప్పుడు తండ్రి సరస్వతిని పెళ్ళి చేసుకోడం తగదన్నారు. దానికంటె రూపగుణములు గల దానిని పవిత్రమైనదానిని పెళ్లి చేస్తానన్నాడు. తండ్రి చెప్పిన మాటల్లో నిజం లేకపోలేదు అనిపించింది వానికి. తండ్రి మాటల ననుసరించి సరస్వతి ఎంగిలికూటిలాంటి దను కున్నాడు. ఇంక తండ్రికి సమాధానమేమీ చెప్పకుండా తండ్రి ఎదుటనుండి ఆనందం వెళ్ళిపోయాడు.

వెంకటరత్నంగారు సరస్వతికి పెండ్లి చేద్దామని తన శాయశక్తులా ప్రయత్నించాడు—ఒక షావుకారు గుమాస్తా యువకుడు నెలకు ముప్పైరూపాయిలు తెచ్చుకుంటున్నాడు. వేరే ఆధారమేమీ లేదు. విషయమే దాచకుండా వెంకట రత్నంగారు, సరస్వతి పరిస్థితినంతా వానితో చెప్పారు.

ఆమెతోపాటు ఆమె తండ్రి ఆస్తి అంతా నీకే చెందుతుం దన్నారు. ఆ యువకుడు వెంకటరత్నంగారితో ఏదో పని వుండి వచ్చి సరస్వతిని చూచాడు. తనకు ఇష్టమే నన్నాడు. కాని తనతల్లి అన్నగార్ల అంగీకారాన్ని కూడా తీసుకొని రేపు స్థిరపర్చుకొంటాననాడు. మరి ఆయువకుడురాలేదు. వెంకటత్నంగారు వానిని కలుసుకొని ఏమైనదనిఅడిగితే, "మా అమ్మ, అన్నయ్య అంగీకరించ లేదండీ" అన్నాడు.

—మరో సంబధం, నలభై సంవత్సరాల వయస్సు కలిగిన బట్టల దుకాణ యజమాని. పదివేల రూపాయల ఆస్తి గలవాడు. వాని భార్య ఈమధ్యనే చనిపోయింది. ఇద్దరు మగపిల్లలూ, ఇద్దరు ఆడపిల్లలూ ఉన్నారు. ఆసంబంధం వెంకటరత్నంగారికే నచ్చలేదు.

—మూడో సంబధం. ఒక యుకకుడు. అందమైన వాడు. నిరాధార నిరంజనుడు. ఒక కాఫీహోటలులో పని చేస్తున్నాడు. పెళ్ళిచేసి వానిని ఇల్లరిక ముంచుకొంటే బాగుంటుందని తోచి, వెంకటరత్నంగారు వానిని అడిగారు. ఆ యువకుడు సంతోషంతో అంగీకరించాడు. సరస్వతిని చూచాడు. ఇంతలో ఆ యువకుణ్ణి ఎరిగినవ్యక్తి—"వాడు పరమదొంగ; ముండల ముఠాకోరు; పైకి మేడిపండులా బాగానే కనుపిస్తున్నాడేగాని సుఖరోగాలతో వాని శరీర మంతా పుచ్చిపోయింది; కావలిస్తే బట్టలు విప్పించి చూడండి, మీకే తెలుస్తుంది!" అని చెప్పాడు.

"ఇలాంటివాణ్ణి కట్టబెడితే వాళ్ళ ఊళ్ళూ ఇల్లూ గుల్లచేసి ఉడాయిస్తాడు. పాపం, ఈ అమాయకురాలికి

పేరొక క్రొత్తపీడ తెచ్చిపెట్టిన వాడనౌతాను" అనుకొని ఆ సంబంధంకూడా విరమించారు వెంకటరత్నంగారు.

ఈవిధంగా, ఎంతప్రయత్నించినా సరస్వతికి యోగ్యుడైన వరుడు దొరకలేదు. సరస్వతికై చేసిన ఈ వివాహ ప్రయత్నమంతా వెంకటరత్నంగారికి ఆనందానికి తప్ప ఆ యింట్లో మరెవ్వరికీ తెలియదు. అతి రహస్యంగా రత్నంగారు ఈ వ్యవహారం నడిపారు.

♦ ♦ ♦

సరస్వతి వచ్చి పదిహేనురోజులు దాటింది. ఒకనాడు శంకరశాస్త్రిగారు వచ్చి ఇంక సరస్వతిని తీసుకొని వెడతామన్నారు. ఇంకో పదిరోజులు ఉంచమని రత్నంగారూ వారి పిల్లలూ కోరారు.

"మేము దీన్ని విడిచి ఈ పదిహేనురోజులూ ఎలా గడిపామో పరమేశ్వరుడికే తెలుసు! ఇంక విడచి ఉండలేమయ్యా!" అని చెప్పి శాస్త్రిగారు సరస్వతిని వెంటబెట్టుకొని తమగ్రామం వెళ్ళిపోయారు.

సరస్వతికి పెళ్ళిచేసి ఆమె జీవితాని కోబాట ఏర్పరుద్దామని చేసిన ప్రయత్నం ఫలించనందుకు వెంకటరత్నంగారు మనస్సులో బాధపడ్డారు.

# 19

సరస్వతి జీవితం ఒక మంచుకొండలా ఉంది. ఆమెది కరడుకట్టిన పచ్చి యవ్వనం. విషాదాచ్ఛమైన ఆమె ముఖం

మంచుగడ్డలా జడత్వాన్ని సూచిస్తోంది. లోన—అగ్ని పర్వతంలోని శిలాద్రావకంలా ఉడుకెత్తే నెత్తురు జీళ్ళపాకం లా ఆమె నరాల్ని సాగదీసే ప్రబలవాంఛలు! తియ్యని కలలు, తీరనిబాధలు, వేడి నిట్టూర్పులు, వెచ్చనికన్నీళ్ళు! ఏవేవో దృశ్యాలు ఆమెకు సూర్యరశ్మిలా గోచరిస్తాయి. ఆమె హృదయాన్ని మంచులా ఆవరించిన నైతిక ఆవరణ కరగి తొలగిపోతుంది. సూర్యకాంత శిలవలె మానవ సహజ హృదయం బయటపడుతుంది. ఆ దృశ్యాలు సూర్యకిర ణాల్లా ఆమె హృదయాన్ని భగ్గున మండిస్తాయి!—వాడ్డి లోని గిత్తమూపు ఆమె హృదయాన్ని ఉరకలు వేయిస్తుంది! వెళ్లి దాన్ని గాఢంగా కౌగలించుకొంటుంది! దాన్ని ముఖాన్ని ముద్దెట్టుకొంది!

—నల్లని చానమొద్దులా కండలు తిరిగి చానలుదీరిన పాలేరు, వెంకడి శరీరానికి గోచీ తప్ప మరేమీ వాడి ఒంటిన ఉండదు. అది ఆమె గుండెల్ని గుబగుబలాడిస్తుంది! పని చేసేటప్పుడు మెలితిరిగే వాని కండరాలు ఆమె హృద యాన్ని మెలిపెడుతుంటాయి.

—ఇంటి కెమురుగా శేఖరం, వాని పెళ్ళాం, ప్రక్క యింటిలో కాంతక్క గోపాలంబావ, చాకలి మసేను, వాని పెళ్ళాం; మొదలైన భార్యాభర్తల జంటల్ని చూస్తూ ఏవేవో కథ లల్లుకొంటుంది సరస్వతి.

ఇంట్లో, అమ్మనీ నాన్ననీ చూస్తూంటే ఆమెకు కోరి కలు రేకెత్తుతాయి—వైశాఖమాసంలో మిట్టమధ్యాహ్నం, ఎండ మండుకుపోతుంది. శాస్త్రిగారు తమ గదిలోను

రెండో గదిలో సరస్వతి, వంటింటి గుమ్మంలో లక్ష్మీదేవమ్మ గారు, మేనులు వాల్చారు. సరస్వతి దొర్లి దొర్లి కునుకు తీసింది. కొంతసేపటికి ఒడలంతా చెమటతో తడిసి ఆమెకు మెలకువ వచ్చింది. దాహం వేసి మంచినీళ్ళకోసం వంటింట్లోకి వెళ్లింది. అక్కడ అమ్మలేదు. తలుపులన్నీ గడియలు వేసి ఉన్నాయి. నాన్నగది తలుపుకూడా మూసిఉంది. లోపల నుండి ఏవో గుసగుసలు, సన్నని మూలుగులు, చప్పరింతలు మంచం కిరకిరలు ఆమెకు వినిపించాయి! లోపల ఎవరున్నారో ఏమి జరుగుతోందో గ్రహించుకొని సరస్వతి దీర్ఘంగా నిట్టూర్చి మంచంమీదికి వచ్చి పడింది.

—ఒకనాటి సాయంకాలం, ఐదుగంటలవేళ సరస్వతి కాంతక్కగారింటికి వెళ్లింది. కాంతక్క తన మొగుణ్ణిగురించి గొప్పలు చెబుతూంటుంది. అతని నిత్యకృత్యాల్లోని వింతలు వర్ణిస్తూంటుంది. ఆమాటలు వినడం సరస్వతికి చాలాసరదా! కాంతక్క మగడు, గోపాలంబావతో మాట్లాడ్డానికి ఆమె ఉవ్విళ్ళూరుతోంటుంది. నిత్యమూ కనుపించేవాడైనా వానిని వింతగా చూస్తోంటుంది. ఆవేళ కాంతక్క మొగుడు ఇంట్లో లేడు. ఒక అరగంట కాంతక్కతో పిచ్చాపాటీ మాట్లాడి సరస్వతి పెరటిగుమ్మంనుంచి యింట్లోకి వచ్చింది. అమ్మ గాని, నాన్నగాని ఉన్న అలికిడిలేదు. అమ్మ ఎక్కడికి వెళ్ళిందాఅని ఆలోచిస్తూ వీధి హాలువరకూ వెళ్ళింది. వీధి తలుపు లోపల గడియ వేసివుంది. మళ్లీ తిరిగి వంటింటి వైపుకి వస్తుంటే నాన్న గదిలోంచి మళ్లీ గుసగుసలు, మూలుగులు, మంచం కిరకిరలు!

ఇలాంటివి ఎన్నో మిట్టమధ్యాహ్నాలు, సాయంసమయాలు, అర్ధరాత్రులు చూచింది సరస్వతి అమ్మనీ నాన్ననీ చూస్తోంటే ఆమెకు ఈర్ష్య ద్వేషం కలుగసాగాయి — — "నాన్నకి ఏభై యేళ్ళు, అమ్మకి నలభై. మరి నాకు? ఇరవై. నేను మనిషిని కానా? కొబ్బరి దుంగనా, తుమ్మమొద్దునా? నాకు యవ్వనంలేదూ? కోరికలు లేవ్వూ? ఈ రహస్యాలు నాకు తెలీవ్వూ? ఇలాంటి రహస్యపు పనులు వాళ్ళు వారానికో పదిరోజులకో చేస్తారు గానీ నేను ప్రతిరోజూ ప్రతి నిమిషమూ చేస్తాను! చెయ్యగలను. ఐతే వాళ్ళు ఏమీ ఎరగనట్టు నాకేమీ తెలియదన్నట్టుగా నాకేమీ అవసరం లేదన్నట్టు నన్ను ఇలా వదిలివేశారేం?

—"ఆలయంలో వేణుగోపాలస్వామికి (శ్రీ) పుష్పయోగం. ఆచార్లుగారు నాన్నని పిలిచారు. అంతా వెళ్ళి ఆ రాత్రి బొమ్మల్ని మంత్రాలు చదివి గదిలో పెడతారు. ఆ వేణుగోపాలస్వామికి ఇద్దరు పెళ్ళాలు! ఇద్దరేం ఖర్మం! కృష్ణుడికి పదహారు వేలమంది గోపికాస్త్రీలు! ఈ స్వేచ్ఛ, ఈ కోరిక, మగాళ్ళకేగాని ఆడాళ్ళకి ఉండకూడదా? ఆడది పరాయి మగాడితో మాట్లాడుటకూడా సహించరే! కాని ద్రౌపదికి అయిదుగురు భర్తలు! "ఎంత అదృష్టవంతురాలో, మా ఊళ్ళో నాగి పిల్లలాగ! నాగిపిల్లకి ఉన్నారట? అయిదుగురో ఆరుగురో భర్తలు!

—"ఒక రోజంతా ఆవు అరచింది, ఏమిరా, అలా అరుస్తోందే అన్నారు నాన్న పాలేరుతో. పాలికారుకి

వచ్చిందండీ' అన్నాడు వెంకడు. ఐతే నాయుడుగారి ఆబోతు దగ్గరకు తీసుకెళ్ళ మన్నాడు నాన్నగారు. వెంకడు ఆవును తీసుకెళ్ళాడు అది చూడుతో ఉంది;—"

—"పెళ్ళంతా ఎవరి కోరికలు వాళ్ళు తీర్చుకొంటున్నారు. దేవుడు పెళ్ళిలో చెప్పకపోయినా అవసరం ఉందేమోనని దేవుడికికూడా కోరికలు తీరుస్తున్నారు. పీళ్ళ ఆవులకీ గేదెలకీ కూడా కోరికలు తీరుతున్నాయి. భర్త చచ్చిన వాళ్ళు భర్తను విడిచిపెట్టినవాళ్ళ ఖర్మనే ఇలా కాలిపోయిందా? నేను భర్తను వద్దన్నానా? విడాకు లిమ్మన్నానా? ఆయన చేసిన అన్యాయానికి, ఆయన చేసిన తప్పుకి ఫలితం నేనా అనుభవించడం? కల్లోనైనా నేను భర్త అక్కర్లేదని అనలేదే! మగాడికోసం ఇలా తపించిపోయే శరీరానికి ఒకడేమిటి, ఆ ద్రౌపదిలా, నాగిపిల్లలా ఐదుగు రున్నా తనివి తీరదు!

కానీ పాపం వాళ్లేం జేస్తారు? ఇదంతా నా ఖర్మ! నాకు పెళ్ళిచేశారు. పునస్సంధానం చేశారు. నా తెలివి తక్కువతనం నన్నిలా నాశనంచేసింది. ఆయన బుద్ధి మారిపోయింది. నా మగని బుద్ధి వక్రించి నన్ను వదిలేస్తే పీళ్ళేం చేయగలరు? ఆయన్ని ఒప్పించి నన్ను చేర్చడానికి ఎంతో ప్రయత్నం చేశాడు. మా నాన్నగారు నాకు మళ్ళీ పెళ్ళి చేసి ఆయన ఘోరవాది నరకాల పాలౌతాడా? కుల భ్రష్టుడౌతాడా? తమ వంశ గౌరవాన్ని బూడిదపాలు చేసుకొంటాడా? నేను మావాళ్ళమీదనింద మోపడం న్యాయం కాదు. ఇదంతా నా ప్రారబ్ధం, ఖర్మ ఏనాటిదో ఎవ్వతెనో

భర్తకు కాకుండా ఎడబాటుచేశాను. ఈ నా డిలా అనుభ విస్తున్నాను !''—

ఈ విధమైన తపనతో సరస్వతి దుర్భర జీవితంలో ఇంకో నాలుగేళ్ళు గడిచాయి. ఇప్పుడు కాంతక్కకు నిండు నూలాలు. ఆమె పుట్టింటివారు కాకినాడలో ఉన్నారు. కాంతక్కని పురుటికై అక్కడికి తీసుకెళ్ళారు. ఆమె భర్త మాత్రం ఇంటిదగ్గర వ్యవసాయపు పనులు చూచుకొంటు న్నాడు. కాంతక్క ఉంటే సరస్వతి స్వేచ్ఛగా స్వతంత్రంగా వాళ్ళింటికి వెళ్ళేది. అక్క చాటునఉండి గోపాలంతో కులు కుతూ పలుకులాడేది. వేళాకోళాలు చేసేది. ఇప్పుడు వాళ్ళ ఇంటికి ఏవంక పెట్టుకొని వెడుతుంది ? వాళ్ళ యింట్లో ఒక ముసలమ్మైనా లేదు. గోపాలం ఒంటరిగా వండుకొని తింటు న్నాడు. ఇలా ఒంటరిగా ఉన్నప్పుడు గోపాలం తోనన్నా మాట్లాడాలని ఆమెకు ఎంతో కోరికగా ఉంది. అలాంటి అవకాశం, అదును ఎప్పుడు దొరుకుతుందా అని సరస్వతి తహతహ లాడుతోంది.

గోపాలం సరస్వతిగారింటికి రోజూ ఏదో ఒక వేళ వచ్చి శాస్త్రిగారినీ, లక్ష్మీదేవమ్మగారినీ "ఏం చేస్తున్నారు? భోజనా లయినాయా ?'' అని కుశల ప్రశ్నలు వేస్తూం టాడు. ఐదారు నిమిషాలు కూర్చొని పోతూఉంటాడు. అత నక్కడ ఉన్నంతసేపూ సరస్వతి వాణ్ని చూస్తూనే ఉంటుంది. ఈమధ్య అతను సరస్వతివైపు వింతగా చూడ్డం ప్రారంభించాడు. ఆ చూపుల్లోని భాష సరస్వతికి అర్థమౌ

తోందికాబోలు, తానుకూడ హృదయదాహంతో చూపులు విసరేది.

"మగాడవు, నువ్వు చెయ్యి కాల్చుకోడ మేమి టోయ్ ! ప్రక్కను మేముండగా ? ఓ నెలరోజులు నువ్వు తిన్నంత మాత్రాన మా సంపద తరిగిపోదులే. రెండు పూటలా నీవేళకు వచ్చి ఇక్కడే భోజనంచెయ్యి నాయనా!" అని లక్ష్మీదేవమ్మగారు గోపాలంతో చెప్పింది.

"నీ కెందుకొచ్చింది ఈ అవస్థ ? ఇక్కడ తింటూ ఉండు బావా" అని తల్లి మాటకు ఊతం ఇచ్చింది తను.

"వంట చేతకానివాడికి అవస్థగాని నాకేమండీ ? నాకంటే బాగా వండగలగా సరస్వతి ?" అన్నాడు గోపాలం.

"నీతో సమానంగా ఎవరు వండగలరు బాబూ, నువ్వు ఆడమగాడివి !" అని వేళాకోళ మాడింది సరస్వతి.

"అవసరం లేదండీ అత్తగారూ, వంట చెయ్యడం నాకు సరదా. కాంతం ఇంట్లో ఉంటే నేను వండేది ఎలాగూ లేదు. ఇప్పుడైనా నాసరదా తీర్చుకోనివ్వండి" అని గోపాలం స్వయంగానే వండుకొని తింటున్నాడు. తాము చేసుకొన్న కూరో, పచ్చడో వాని భోజనంవేళకు పట్టుకెళ్ళి ఇస్తూండేది లక్ష్మీదేవమ్మగారు.

ఒకనాడు లక్ష్మీదేవమ్మగారికి జ్వరం వచ్చింది. సరస్వతి వంటచేసింది. తాను ఎదురుచూచే అవకాశం నేటికి చేజిక్కినందుకు ఆమె హృదయం చిందులు తొక్కుతోంది. బావకు యిష్టమయే వంకాయకూర, పప్పుపులుసు ఎంతో శ్రద్ధతో చేసింది. "బావ భోజనంచేసే వేళయిండి. కూర

తీసుకొని వెళ్ళియివ్వనే?" అని అమ్మ నడిగింది. 'ఇయ్యమ్మ' అంది తల్లి. కూరా, పులుసు పట్టుకొని దొడ్డిగుమ్మాన వయ్యారంగా కాంతక్కగారింటి వంటింట్లో ప్రవేసించింది. కుంపటిమీద అన్నానికి ఎసరుపెట్టి విసరుతున్నాడు గోపాలం. సరస్వతిని చూడగానే వాని ముఖం కమలం లా వికసించింది. "ఇవేళ నువ్వు తెచ్చావేమిటోయ్?" అన్నాడు నవ్వుతూ. "ఏం నేను తేకూడదా ఏమిటి ?" అని చిత్తరచూపులు చూస్తూ సాగదీసింది సరస్వతి.

"అహా. నిక్షేపంలా తేవచ్చు. పూట పూటకీ ఈ తెచ్చియివ్వడంకంటే నువ్వే ఇక్కడ వంటచేసిపెడితే మరీ సంతోషిస్తాను."

"ఓహో ! అలుసిస్తే పెళుసెక్కుతోంది వ్యాపారం!" అంది నవ్వులో చిన్న కోపాన్ని వెల్లడిస్తూ.

"కోపగించకండి మరదలుపిల్లగారూ ! పెళ్ళాం తరువాత పెళ్ళాం అంతటిదిగదా మరదలు, అని చెప్పాను."

"సరి సరీ ఇదోటికూడానా ? కాస్త నోరు సంబాళించుకొని మాట్లాడండి బావగారూ ?"

"నీకంత కోపమైతే నోరు విప్పనే విప్పను. చేతులతోనే చెప్పి చేయిస్తాను వంట."

"అలాగా .అంత సాహసమున్నదేం ? ఏదీ చేయించు"

గోపాలం వెర్రి ఆవేశంతో లేచి ఆమె చెయ్యి పట్టుకున్నాడు.

ఆమెలోని సరసరమూ మీటిన వీణతీగలా స్పందించింది. "అబ్బ ! మగాడి స్పర్శ ! అనే మాటలు ఆమె

మనస్సులో గుడి గంటల్లా ధ్వనించాయి. ఆమె కదల్లేదు. మెదల్లేదు. మాట్లాడలేదు. ఆ స్పర్శలోని సుఖాన్ని తన్మయత్వంతో కొద్దిక్షణాలు అనుభవించింది. గోపాలం ఆమె చేతిని అలాగే పట్టుకొని 'సరస్వతి' అని ఆమె కళ్ళల్లోకి జాలిగా దేనికోసమో ప్రాధేయపడి అడుగుతూ ఉన్నట్టుగా చూచాడు. సరస్వతి ఆనందం నిండిన కళ్ళతో వాని ముఖంలోకి చూచి బావా!" అంది. సూదంటురాయివంటి ఆకర్షణ శక్తి వారిద్దరినీ బిగ్గరగా, ఇంకా దగ్గరగా, గాఢంగా, కలిపివేసింది! కొన్ని క్షణాలకు సరస్వతి ప్రకృతికి వచ్చింది. బావను పెనవేసిన చేతులు వెనుకకుతీసుకొంది. తల వొంచుకొని 'వెళ్ళొస్తా' అంది. మునివ్రేళ్ళతో ఆమె గడ్డం పట్టుకొని పైకెత్తాడు. 'ఎప్పుడు వస్తావ్?' అన్నాడు. సరస్వతి మాట్లాడలేదు. కళ్ళు మూసుకుంది. "రాత్రి అందరూ నిద్రపోయాక, ఇక్కడే నీకోసం ఎదురుచూస్తూ ఉంటా" అని ఓ ముద్దుపెట్టుకొని వదలిపెట్టాడు గోపాలం. సరస్వతి చరచరా వెళ్ళిపోయింది.

## 20

గోపాలం బావతో సరస్వతి ఒక పదిహేనురాత్రులు పదిహేను క్షణాలుగా గడిపివేసింది. . గోపాలం బావ సహృదయుడు, సుందరాకారుడు, సరసుడు, రసికుడు ఈ ప్రపంచంలో మరెవరూ లేడనిపించింది, సరస్వతికి.

"సరస్వతీ! కాంతంతో పదేళ్ళనుండీ కాపురంచేస్తున్నా ఒక్కనాడుకూడా ఈ ఆనందాన్ని అనుభవించలేదు. నీ

ప్రణయకళా చతురిమతో నాజీవితం ధన్యమయింది. ఇంక నిన్ను ఎన్నటికీ విడిచిపెట్టలేను సరస్వతీ, నా హృదయ రాణీ !" అని ఏవేవో హృదయరంజకంగా మాట్లాడేవాడు గోపాలం. సరస్వతికళ్ళనుండి ఆనందాశ్రువులు జలజలరాలేవి. తన్మయత్వంలో గోపాలంబావ వక్షంమీద వాలిపోయేది.

ఒకనాడు పిడుగులాంటి వార్త ఒకటి వారి గుండెల్ని దద్దరిల్లజేసింది. హఠాత్తుగా పర్వత శిఖరంనుండి పాతాళం లోనికి పతనమైనట్లు గోపాలం మనస్సు కృంగిపోయింది. తన్ను ఎంతో ప్రేమించి, ఆడించి, నవ్వించే కాంతక్కమరణా నికై సరస్వతి వలవల ఏడ్చింది. "అయ్యో ! పాపం, లేకలేక ఏడేళ్ళకు కాన్పు వచ్చింది. ఇంతలో ఈ దారుణమా, అయ్యో భగవంతుడా నీ కింత నిర్దయ కూడదయ్యా ! వచ్చి కాయల్ని ఇలా బ్రద్దలు చేస్తే సామాన్య మానవులం మా గుండెలు బ్రద్దలు కావుటయ్యా !" అని గోపాలానికి కాంతానికి సంబంధించిన బంధువులంతా వాపోయారు.

లోకంలోని సమస్తసుఖదుఃఖాలను, ఆనంద విషాదా లనూ, పాప పుణ్యాలను మోసుకొంటూ గంభీరంగా నియమబద్ధమైన గమనంతో ముందుకి సాగిపోతూనేవుంది కాలవాహిని. గోపాలానికి పిల్లనిచ్చి పెళ్ళి చెయ్యడానికి చాలామంది ప్రయత్నిస్తున్నారు — "పోయినవారితో మనమూ పోగలమా నాయనా ? ఏదో బ్రతికున్నన్నాళ్ళూ సుఖానికి ప్రాకులాడుతూ ఈ మాయజీవితాన్నిలా గడుప వలసిందే, ఏది వచ్చినా ఓర్చుకొంటూ జీవిత కర్తవ్యాలా

షాలు సాగించుకొంటూనే పోవాలి. కష్టం వచ్చినప్పుడు క్రుంగిపోవడం మానవ సహజం, ఆ కష్టాన్నే మనస్సులో పెట్టుకొని జీవితాన్ని పాడుచేసుకొంటామా ? ఇంక నువ్విలా విచారిస్తూ కూర్చుంటే లాభంలేదు. ఈ మాయనంతా మరచిపోయి యథాప్రకారం నీ పనిపాటలు చక్కబెట్టుకోవోయ్ ! నీకేం లోటు ! మగవాడవు; యువకుడవు; ఊఁ అన్నావంటే ఈనెల్లోనే ఆ మూడుముళ్ళు వేయించేస్తాం. అనేకమంది అఱ్ఱులు చాచుకొని ఉన్నారు నీకు పిల్ల నివ్వడానికి. నువ్విలా ఒంటరిగా వుంటే మేం చూడలేం నాయనా! నీకు ఏ సంబంధం యిష్టమో చెప్పు. నువ్వేమీ శ్రమపడనక్కరలేదు. ఏ ప్రయత్నమూ చెయ్యనక్కరలేదు. మేమున్నాంగా, అన్నీ చక్కబెట్టుకొని పోతాం" అన్నారు గోపాలం హితాభిలాషులు కొంతమంది.



"మన సుబ్రహ్మణ్యంగారి మనుమరాలిని ఇస్తారుటే మన గోపాలానికి" అన్నాడు శంకరశాస్త్రిగారు భార్యతో.

"బాగుందండీ, సంబంధం ఖాయమైనదా ? పెళ్ళైనవాడు ? పాపం మళ్ళీ ఓయింటి వాడైతేనూ !" అంది లక్ష్మీదేవమ్మగారు.

"అదేమిటే, వానికి పెళ్ళవడ మెంతసేపు ! నిండా ముప్పై ఏళ్ళయినా లేవు. పదెకరాలు పండిస్తూన్న భూస్వామి. మేమంటే నేమని, వానికి పిల్ల నివ్వడానికి పోటీలు పడుతున్నారుకూడా ఈ సంబంధం స్థిరపడినట్టే. వచ్చే పూర్ణి

మలోపున, ముహూర్తంకూడా కుదురుతుంది" అన్నారు శాస్త్రిగారు.

గోపాలం పెళ్ళివిషయాలు ఒక్కొక్కటే సరస్వతి చెవుల బడుతున్నాయి. అమ్మా నాన్నా చెప్పుకొన్న మాటలు ఆమె విన్నది. ఆమెకు అవ్యక్తమైన ఆవేదన అంతు లేని ఆందోళన కలిగాయి. ఆరోజున అర్ధరాత్రివేళ మెల్లగా గోపాలం గది కిటికీవద్దకు వెళ్ళింది. నెమ్మదిగా చప్పుడుచేసి బావను లేపింది.

అతను తలుపు తీసి "ఇదేమిటి ఇప్పుడు వచ్చావే ?" అని అడిగాడు.

"బావా నా గతేమిటి ? నన్నిలా వదిలివేయడం నీకు న్యాయమే ?" అని కంట తడి పెట్టుకుంటూ అడిగింది.

"ఏం చెయ్యను సరస్వతీ ! నిన్ను ఉద్ధరించడం ఆ బ్రహ్మవశంకూడా కాదు !"

దూరంగా ఎక్కడికైనా పోయి పెళ్ళి చేసుకొందాం బావా ! నీ సేవ చేసుకుంటూ ఆనందంగా జీవితాన్ని గడుపు కుంటాను."

"అమ్మో, పెళ్ళే ! ఈ లోకంలో ఇంక నాకు మంచి నీళ్ళయినా పుట్టవు ! అదిమాత్రం అసంభవం !" అన్నాడు నిష్కర్షగా.

"బావా, నన్ను, నువ్వు కాపాడి ఆదరించకపోతే నా కింకెవరు దిక్కు" అని వాని పాదాలు పట్టుకొని వలవల విలపించింది సరస్వతి.

"ఈ విషయంలో ఇంక నువ్వెంత యేడ్చినా లాభం లేదు. నీ జీవిత మేనాడో భగ్నమైంది. నీతోపాటు నన్ను కూడా పాడైపోమ్మంటావా? అది యెన్నటికీ జరగదు. ఇంక నువ్వు వెళ్ళవచ్చు!" అని కఠినంగా చెప్పి తలుపు మూసుకున్నాడు గోపాలం.

సరస్వతి నీటితో నిండిన నల్లని మేఘశకలంలా ఇంట్లోకి పోయి తన మంచంమీద నేను వాల్చింది.

# 21

గోపాలానికి పెళ్ళయిపోయింది. కాంతం పేరు కాల వాహినిలో కొట్టుకొనిపోయింది. ఇంతలో రామచంద్ర పురంనుండి వచ్చిన ఒక ఉత్తరం శంకరశాస్త్రిగారి కుటుం బాన్ని దుఃఖసముద్రంలో ముంచివేసింది. వారి అల్లుడు రంగారావు విషజ్వరం వచ్చి కాలం చేశాడని శాస్త్రిగారి బంధువు ఒకాయన వ్రాశాడు. లక్ష్మీదేవమ్మగారు కూతుర్ని కావలించుకొని "నీరాత ఇలా బుగ్గయి పోయిందేమే తల్లి! ఈ పసుపుకుంకుమను కూడా చూచి ఓర్వలేకపోయాడే ఆ మాయ దేవుడు! ఏనాటికైనా వాని బుద్ధి మళ్ళుతుంది. నా తల్లి మొగుడితో కాపురం చేస్తుంటే చూద్దామని ఎదురు తెన్నులు చూశానే! ఇంతలోనే బ్రతుకిలా భగ్నమై పోయిందేమే తల్లీ!" అని రాగాలు తీస్తూ కంటికీ మంటికీ ఏకధారగా విలపించ సాగింది. సరస్వతి భావశూన్యమై చైతన్య రహితమైన శిలా ప్రతిమలా కూర్చుంది. చుట్టు

ప్రక్కల వారంతా చేరారు — "భర్తసుఖ మెలాగా పోయింది, పోనీ ఆ పసుపు కుంకుమ కూడా చెరిపెయ్యాలా మాయదారి దేముడు !" అని పరిపరి విధాల అక్కడకు చేరిన ఆడవాళ్ళంతా చెప్పుకొంటున్నారు. "లేవమ్మా ! నువ్వే అలా వాపోతే ఆ పిల్ల ప్రాణాలు నిలుస్తాయా చూడు ఎలా చెదిరిపోయిందో పిల్ల ! దాని ఖర్మానికి మనం కర్తలమా అమ్మా ? మనకు చేతనైనంతవరకూ అది సుఖ పడాలనే ప్రాకులాడతాం. దైవం విముఖమైతే మన నేమి చెయ్యగలం ?" అని అనేక విధాల లక్ష్మీదేవమ్మగారిని ఓదార్చుతున్నారు ఆడంగులంతా.

శంకరశాస్త్రిగారు పరమేశ్వరా ! ఒక్కగానొక్క కూతురే ! దాని జీవిత మిలా నాశనంచెయ్యడం నీకు న్యాయమా ? చూచి జీవితమంతా ఇలా దుఃఖించవలసిందే? అని వాపోతూ హాలులో కూర్చున్నారు.

ఊళ్ళోని బంధువులు, స్నేహితులు పరామర్శకు వచ్చారు—"అన్నీ తెలుసున్న జ్ఞానులు మీరు విచారిస్తే ఎలాగ శాస్త్రుల్లగారూ ! దైవ నిర్ణయాన్ని ఎవరు తప్పించ గలరయ్యా ? అని ఏమేమో అంటూ సానుభూతిని తెలియ జేశారు.

భర్త చనిపోయిన స్త్రీకి జరుగవలసిన విధులలో సరస్వతికి కేశములు ఉంచాలా, తీసెయ్యాలా అన్న ప్రశ్న బయలుదేరింది. "ఇంకా చిన్నపిల్ల. ఇప్పుడా మాట ఎత్త కండి" అన్నాయి కొన్ని క్రాఫింగ్ తలకాయలు.

శంకరశాస్త్రిగారి కిలాంటి పిచ్చి పిచ్చి ధోరణులు నచ్చవు. వారి కుటుంబమంటే ఏమనుకున్నావ్ ? శాస్త్రి గారి ముత్తాత యజ్ఞంచేసి సోమయాజి అనిపించుకున్నారు. శాస్త్రి తాత తండ్రులుకూడ నిత్యాగ్నిహోత్రులు ! వేద శాస్త్ర పండితులు. తమ పెద్దలనాటినుండీ అనుశ్రుతంగా వస్తున్న సనాతన ధర్మ సాంప్రదాయాల్ని అక్షరాల పాలిస్తూ వేదాధ్యయన సంపన్నుడైన శాస్త్రిగారు సకేశియైన విధవను ఇంట్లో పెట్టుకొని ఉంటారా ? ఎంత మాట ! అన్నాయి కొన్ని బిళ్ళగోచులు, విభూతి పిండికట్లు, అంగుష్ఠమాత్రపు పిలకలు !

ఈ చర్చ అంతా శాస్త్రిగారి ఎదుటనే జరుగుతోంది. ఇంతవరకూ వారి చర్చను వింటూ కూర్చున్న శాస్త్రిగారు విచారంగా "ఔనయ్యా, అంతే ! ప్రాచీన సాంప్రదాయా లకి భంగం కలిగితే సహించలేదీ ఘటం !" అని సరస్వతికి కేశములు తీసివెయ్యాలనే వాదనతో ఏకీభవించారు.

భర్త చనిపోయాడన్నా దుఃఖించని సరస్వతి ముండన క్రియ చేసే మంగలివానిని చూచి వలవల విలపించింది. పనికి రాదు పొమ్మని మంగలిని కసరి కొట్టింది.

"తప్పమ్మా అలా అనకూడదు. మన ఆచారాలను మర్యాదల్ని పాటించాలి." అని నచ్చచెప్పడానికి ప్రయత్నిం చారు ఇద్దరు పూర్వసువాసినులు.

హృదయ విదారకంగా విలపించే సరస్వతి గోడును వేరు విధంగా అర్థం చేసుకొని అంతా తృప్తిపడ్డారు — "ఒక్కరోజు కాపురం చెయ్యకపోయినా పాపం భర్తకోసం

ఎంతగా దుఃఖిస్తోందో ! ఐన కుటుంబంలో పుట్టినవాళ్ళు ఇలాగే ఉంటారు మరి ! ఆ సోమనాథం చెల్లెలు చూడు ముప్ఫై ఏళ్లు దాటి నలభయ్యో పడిలో పడి మొగుడు చచ్చినా పునిస్త్రీ పడుచులా ఉంది ! ఏ గూటి చిలక ఆ గూటి పలుకు పలుకుతుంది !" అని సాగతీసింది ఓ తల నెరిసిన ముసుగు.

బలవంతంగా సరస్వతికి కేశఖండన జరిగింది. ఈ జీవితం ఇంక దుర్భర మనిపిస్తోం దామెకు. తా నింక మనుష్యుల్లో జమ కాదనుకొంది. గదిలో ఓ మూల, కాలి వేళ్లు కూడా కనిపించకుండా తెల్లని ముసుగులో మూసిన బట్టల మూటలా పడి ఉంటోంది. రెండు రోజులు మంచినీరైనా ముట్టుకోకుండా జీవచ్ఛవములా పడివుంది. తల్లి ఎన్ని విధాలా ఏమని మాట్లాడించినా ఉలకదు, పలకదు—"ఇలా ఉండగానే ప్రాణాలుపోతే ఎంత బాగుండును ! చచ్చిపోవాలి !" అని జపం చేస్తోంది.

ఇలాంటి అనేక గడ్డు సమస్యల్ని అవలీలగా పరిష్కరించి ఆరితేరిన ఘటాలు ఆమెను చావనిస్తాయా ? ఆమెచేత అన్నం తినిపించి తీరాయి. వారం రోజుల్లో ఆమెను లేవదీసి మాట్లాడించి, తినిపించి, తమసంఘానికో క్రొత్త సభ్యురాల్ని చేర్చగలిగినందుకు గర్వించాయి కొన్ని గంగాభాగీరథులు !

# 22

ఇప్పుడు సరస్వతికి ఆరోగ్యం బాగులేదని వదంతి. వికారము, వాంతులు; అన్నం సహించదు! పైత్యాంతక రసం, శీతాంశురసం మొదలైన మందులు మింగిస్తున్నారు. కాని ఫలితమేమీ కనుపించడంలేదు.

వసంతఋతువులో చెట్లు చిగిర్చినట్లు తన శరీరంలో ఏదో వింత పరివర్తనను గమనిస్తోంది సరస్వతి. శరీరం తరచూ పులకరిస్తోంటుంది. గోపాలంబావ పదేపదే ఆమె తలపుకి వస్తూంటాడు. నేడుకూడా గోపాలంబావ వారిఇంటిప్రక్కనే ఉన్నాడు. కాని వానిదర్శనమయేభాగ్యం ఆమెకు పోయింది. ఆ తలపులుమాత్రం ఆమె మనసులో ఆణిముత్యాల్లా మెదులుతున్నాయి—"ప్రతీరోజూ అమ్మా నాన్నా నిద్ర పోయాక తన గదికి లోపల గడియ వేసుకొని సందుగుమ్మం లోంచి గోపాలంబావ గదిలోకి తాను వెళ్ళడం; అక్కడ తృషిత నేత్రలతో చూస్తూ అతను చేతులు చాచి తన్ను హృదయానికి చేర్చుకోడం; పందిరి మంచంమీద పరుపులో ఎన్నో గుసగుసలు! కౌగలింతలు! ముద్దులు! ఆ విశాల మైన వక్షం పీటలా తన మెత్తని ఱొమ్ముని గట్టిగా బలంగా నొక్కుతూంటే, మామిడిపండును తినే చిలుకవలె అతను తన పెదిమలు కొరుకుతూంటే...అబ్బా! ఏమా ఆవేశం! ఏమా పరవశం! పొంగే పాలవలె నురగలు గ్రక్కే ఆ ఆనందం, మరెన్నడైనా ఒక్క నిమిషమాత్రమైన యీ

జీవితంలో తనకు లభిస్తుందా ? అసంభవం ! భూమి తల క్రిందులైనా, సూర్యుడు పడమట ఉదయించినాకూడా సంభవం కాదది ! కాని నన్ను అంతగా ప్రేమించి, కామించి, కల్పించి, నవ్వించి, తన కౌగిలిలో కోటిస్వర్గ సౌఖ్యాల్ని చవి చూపించిన గోపాలంబావ ఒక్కసారైనా నా యెదుటికి వచ్చాడుకాదేం ? రాకపోవడమే మంచిది. ఈ వికృత స్వరూపాన్ని చూచి అసహ్యించుకొంటాడు !”—

సర్వనాశనమైన తన జీవితంమీద సరస్వతికి రోత కలిగింది. ఇంకా ఈ బొందెనుండి ప్రాణాలు పోలేదన్న ఆవేదనతో రోజులు దొర్లిస్తోంది. అటువంటి సరస్వతి శరీరం నానాటికి కృంగి కృశించవలసినదిపోయి ఆరోజున కారోజు నునుపెక్కుతోంది. బుగ్గలు నిగనిగలాడుతున్నాయి. పాలిండ్లు బింకంగా పొంకంగా పెరుగుతున్నాయి. శరీరంలావెక్కుతూ కడుపు పెరుగుతోంది. తన శరీరంలో కలిగే ఈ పరివర్తనకు సరస్వతి గుండె దడదడలాడుతోంది. “ఈ కడుపు ఇలా పెరిగిపోతే ? అమ్మా నాన్నా బ్రతుకనిస్తారా ? ఏనుందో మాకో పెట్టి నన్ను చంపేస్తారు ! అదే నిజమైతే వాళ్ళ వరకూ ఎందుకూ ? నేనే మ్రింగుతాను ఆ విషమేదో !... గోపాలంబావా ! నీ కళ్ళయెదుటనే ఇలా నాశనమైపోయి నేను హీనాతి హీనంగా చావవలసిందేనా ?” అని పరిపరి విధాల పరితపిస్తో సిగ్గుతోను భయంతోను, తల్లికైనా తన శరీరం కనుపించనీయక కాలక్షేపం చేస్తోంది సరస్వతి.

ఎంత దాచినా ఆమెలో కలిగె మార్పును తల్లి గమనిస్తోనేఉంది. ఒకనాడు భర్తతో “మనం అశ్రద్ధచేస్తే పిల్ల

మనకు దక్కదు. దాని కడుపులో ఏదో వ్యాధి ప్రవేశించింది. ఓసారి విశాఖపట్నం ఆసుపత్రికి తీసుకొనివెడితే బాగుంటుం దండీ !" అని తన అనుమానాన్ని కప్పిపుచ్చి చెప్పింది.

"మరి, ఇంతకాలమూ చెప్పలేదేమే ? కొంపదీసి వ్యాధి ముదిరిపోలేదుగదా ?" అన్నారు కంగారుగా శాస్త్రిగారు.

విశాఖపట్నం సంగతి ఎత్తేసరికి సరస్వతి ససేమిరా, రానంది. "అమ్మో ! అంతమంది జనండున్న మామయ్యగా రింటికి వెళ్ళడమే !" అనుకొని "చస్తే ఇక్కడే చస్తానుగాని మామయ్యగా రింటికి రాను" అని చెప్పింది.

"మొగుడు పోయింది ఇంకా నాలుగు నెలలైనా కాలేదు. అది మామయ్యగా రింటికి ఎలా రాగలదండీ ? నేరుగా విశాఖపట్టణం ఆసుపత్రికి తీసుకెళ్ళి అవసరమైతే అక్కడే ఉంచి వైద్యం చేయిద్దామండీ!" అని లక్ష్మీదేవమ్మ గారు కన్నీరు కారుస్తూ భర్తతో అంది

"పోనీ, మామయ్యగా రింటికి వెళ్ళనే వద్దమ్మా ! డాక్టరు పరీక్ష అయ్యాక అవసరమైతే ఆసుపత్రిలోనే ఉందువు గాని. లేదా, డాక్టరు చెప్పిన మందులు తెచ్చుకొని ఇంటికి వచ్చేద్దాం !" అన్నారు శాస్త్రిగారు కూతురుతో.

ఆసుపత్రికి వెడితే తనది రోగమో గర్భమో తెలిసి పోతుంది. రోగమైతే నిశ్చింతగా చావవచ్చు. గర్భమైతే ఏ అర్ధరాత్రి వేళో వెళ్ళి సముద్రగర్భంలో తన శరీరం దాచుకోవచ్చునని నిశ్చయించుకొని సరస్వతి తండ్రి చెప్పిన దానికి అంగీకరించింది.

# 23

విశాఖపట్నం జనరల్ హాస్పిటలులో సరస్వతిని పరీక్షించారు. "ఈవిడ సంపూర్ణ ఆరోగ్యంతో ఉంటే రోగమంటూ ఏమిటండీ శాస్త్రిలుగారూ? రోగమూ లేదు రొచ్చూ లేదు; ఈవిడ గర్భవతి" అని నవ్వుతూ చెప్పింది లేడీ డాక్టరు.

శాస్త్రిగారికి కాళ్ళక్రింద భూమి జారిపోతూన్నట్లయింది. తలతిరిగి నిలుచున్న చోటనే చాప చుట్టలా చతికిలబడ్డారు. దగ్గరనే ఉన్న వెంకటరత్నంగారు ఆయనను లేవనెత్తి దూరంగా ఒక బల్లమీద కూర్చోబెట్టారు.

"బావా, చంద్రునికైనా మచ్చఉందిగాని, నేటివరకూ మా వంశానికి ఇలాంటి కళంకం ఎప్పుడూ రాలేదయ్యా! ఇంక నేను తలెత్తుకొని బ్రతకగలనా?" అని విలపించారు శాస్త్రిగారు వెంకటరత్నంగారి దగ్గర.

"మన సమాజంలో కుష్ఠువ్యాధిలా పట్టుకొన్న కుసంస్కారాల ఫలితం బావా, ఇది! మూఢవిశ్వాసాలతో, బూజుపట్టిన సాంప్రదాయాలకు బానిసల మౌతున్నాం. హృదయాల్ని సంకుచితం చేసుకొంటున్నాం! రాక్షస స్వభావాన్ని అనవహింపజేసుకొని గుండెల్ని నల్లరాళ్ళుగా మార్చుకొంటున్నాం! పూర్వాచారమనే ముసుగు వేసుకొని మన ఆడుబిడ్డల్ని, చెల్లెళ్ళనీ గ్రద్దల్లా పీక్కుతింటున్నాం! పూర్వాచారాలు, వంశప్రతిష్ఠలు అనే మైకంలో

మనలోని విచక్షణాశక్తి నశించింది. మనం చేసే హీన కృత్యాలవల్ల కలిగే ఫలితాలన్నిటికీ భగవంతుడే కారణ మంటున్నాం! మనల్ని సృష్టించి, పెంచి, పాలించే దయా మయుడు, కరుణాసముద్రుడైన భగవంతుని మీదనా ఇలాటి అభాండాలు వేయడం ?...ఎంత అపచారం! క్రూర రాక్షసులుగా పురాణాలలో వర్ణించబడిన వాళ్ళు తమని ప్రేమించే బిడ్డల్ని ఇలాంటి హింసలకు గురిచేశారా ? మనం చే జేతులా చేసుకొన్నదానికి విచారించడం హాస్యాస్పదం! ...వాడు విడాకులిచ్చిన మరునాడు దీనికి మళ్ళీ పెళ్ళిచేస్తే ఈనాడీ అనర్థం సంభవించేదా ? దానిదికూడా మానవ శరీరమే. వయసులో ఉంది; మనకుండే కోరికలూ వాంఛలూ దానికీ ఉంటాయి. మొగుడు వదలేసినంతమాత్రాన ఆ వాంఛలు చెట్టుమీది పక్షుల్లా ఎగిరిపోతాయా? మనంకూడా యవ్వనం అనుభవించాం. మగనికి దూరమైన దాని హృద యం ఎలా పరితపిస్తుందో మనకు తెలిసికూడా తెలియనట్లు నటిస్తూ మన ముఖాలకి మనమే మసి బూసుకొంటున్నాం! ...బావా, ఇంక దీనికోసం మనం విచారిస్తే ప్రయోజనం లేదు. కృత్రిమ ప్రవర్తనలకీ మూఢవిశ్వాసాలకీ వ్యర్థప్రతిష్ఠ లకీ తిలాంజలి వదలి అంతరాత్మ ప్రబోధాన్ని ఆలకించాలి! ధైర్యంగా నిలబడి సమాజాన్ని సవాలు చెయ్యాలి!" అని ఆవేశంతో, ఆవేదనతో చెప్పాడు వెంకటరత్నంగారు.

శాస్త్రిగారు నాతబద్ధుడై జీవచ్ఛవంలాకూర్చున్నాడు. మరొకప్పుడైతే వెంకటరత్నంగారు చెప్పినమాటలకు ఆయన ఉగ్ర నరసింహావతారం ఎత్తేవాడే. ఇప్పు డాయన యేమీ

మాట్లాడలేదు. "బావా, ఏమిటి నాకు దారి ?" అని మాత్రం అన్నాడు.

"దీనికి ఆలోచించనక్కరలేదు. సరస్వతిని తిన్నగా ఇంటికి తీసుకొనివెళ్లు. దీనికంతకూ మూలపురుషు డెవడో వెదకిపట్టుకో. వాడు ఏ కులంవాడైనాసరే, ఎంత డబ్బైనా ఖర్చుచేసి వానితో సరస్వతికి పెళ్ళిచెయ్యి. లోకుల్నీ సమాజాన్నీ లెక్కచెయ్యకు. అవసరమైతే ఇందుకు నీకు సహాయంగా రెండు నెలలు సెలవు పెట్టి నీదగ్గర ఉంటాను" అన్నాడు రత్నంగారు.

"చచ్చేవాడితో సరసాలేమిటి బావా ? ఏడ్చేవాణ్ణి ఇంకా యేడిపిస్తావేం ? ఈ విపత్తునుండి బయటపడే మార్గమేదైనా చూపి పుణ్యం కట్టుకో !" అన్నారు శాస్త్రిగారు దీనంగా.

"ఐతే సరస్వతిని మా యింటిదగ్గర వదలేసి వెళ్ళు. దాని మంచిచెడ్డలు నే చూచుకొంటాను"

"మీ యింటదగ్గరా ? రేపే ఎవనినో చూచి పెళ్ళి చేసేస్తావ్ ! నా కొంప దీసేస్తావ్ నాయనా ! నిన్ను నమ్మలేను ? నువ్వు అన్నంతపనీ చేసి తీరుతావు !"

ఎన్నడూ కోపమంటే యేమిటో యెరుగని వెంకట రత్నంగారికి శాస్త్రిగారి మాటలు విని కోపమొచ్చింది—

—"ఐతే, ఈ అమాయకురాలి పీక పిసికి సముద్రంలో పారెయ్యి ! నే పోతున్నా !" అని లేచారు రత్నంగారు.

—వెంకటరత్నంతో మంచిగా మాట్లాడి తనకు లోబరచుకోనకపోతే ఈ స్థితిలో చాలా ప్రమాదం! సరస్వతి గర్భవతి అనే వార్త దుర్గంధంలా గుప్పున నలుమూలలా వ్యాపించిపోతుంది! ఇంతవరకూ తనకు, తన భార్యకు, సరస్వతికి వెంకటరత్నానికి, లేడీడాక్టరుకి తప్ప మరెవరికీ ఈ సంగతి తెలియదు. వెంకటరత్నాన్ని బతిమాలి మంచి చేసుకోని వాని సహాయంతో సరస్వతికి గర్భం పోయే యేర్పాటు చెయ్యాలి. ఈ సంగతి, ఒక్క వెంకటరత్నం రహస్యంగా ఉంచితే మిగిలిన వారిలో ఈ విషయం బయట పెట్టేవా రెవరూ లేరు" అని శంకరశాస్త్రి గారి ఆలోచన.

అందుచేత శాస్త్రిగారు వెంకటరత్నంగారి చెయ్యి పట్టుకొని, "బావా, నువ్విలా కోపగించి పోతే మాగతేమిటి చెప్పు? నీ బావ మానమర్యాదలు నీవి కావా? ఇక్కడ ఈ స్థితిలో నీవుగాక నా కింకెవరు దిక్కు?" అన్నారు.

చిన్నప్పటినుంచీ శాస్త్రిగారినీ వారి కుటుంబాన్నీ బాగా ఎరిగున్నవాడు రత్నంగారు. ఈనాడు తాను ఉపదేశించినంత మాత్రాన ఆయన మనసు మారదని తెలుసు రత్నంగారికి. అందుచే ఆయన కొంచెం శాంతించి—"నేను మాత్రం ఏం చెయ్యగలను బావా?" అన్నాడు.

"దీనికి గర్భం పోయే మార్గం చూడు. ఏదో జబ్బు చేసింది; వైద్యం చేయించామని చెప్పకొని బ్రతుకుతాను" అన్నాడు శాస్త్రిగారు తల వొంచుకొని.

ఈ మాటతో రత్నంగారు "ఆహా, పరమేశ్వరా శ్రోత్రియులు, వేదాధ్యయన సంపన్నులు, పరమ పవిత్రులు అనుకొనే వ్యక్తుల మనస్తత్వమా యిది ?" అనుకొని రెండు నిమిషాలు నిస్తబ్దుడై నిలబడిపోయాడు. రెండు నిమిషాలు దీర్ఘంగా ఆలోచించాడు. ఈ స్థితిలో ఆయనకు గత్యంతర మేమీ కనుపించలేదు—"సరే, ఆ పని ఇక్కడ సాగదు. ప్రయివేటు డాక్టరు దగ్గరకు పోదాం పదండి" అని దీర్ఘంగా నిట్టూర్చారు.



ధనాని కాశించిన డాక్టరొకడు భ్రూణహత్యకు అంగీకరించాడు. ఆయన ఆసుపత్రిలోనే శాస్త్రిగారు మకాం పెట్టారు.

"బావా, నా మాన మర్యాదలు కాపాడాలి ! ఈ సంగతి ఎక్కడా పొక్కనీయకు సుమా ! నీ భార్యకుకూడా తెలియరా దీ విషయం ! ఎలా కాపాడుతావో !" అని రత్నంగారి రెండు చేతులూ పట్టుకొన్నారు శాస్త్రిగారు.

సరస్వతికి ఇదంతా అయోమయంగా ఉంది. లేడీ డాక్టరు చూసి గర్భవతి అని చెప్పగానే, తాను ఇంటినుండి బయలుదేరేముందు చేసుకొన్న నిర్ణయాన్ని దృష్టికి తెచ్చుకొని గుండె రాయిచేసుకొంది. కాని అక్కడినుండి ఇంకో ఆసుపత్రికి తీసుకొని వచ్చిన కారణం ఆమెకు తెలియడం లేదు. "ఎందుకమ్మా, మళ్ళీ ఈఆసుపత్రికి తీసుకొచ్చారు?" అని తల్లి నడిగితే "నువ్వు చేసిన వెధవపనికి ఎన్ని ఆసుపత్రులైనా తిరగాలి ! ఎన్ని గడ్డిలైనా కరవాలి ! నోరు

మూసుకొని మేము చెప్పినట్లల్లా చెయ్యి !" అని కసరింది లక్ష్మీదేవమ్మగారు.

సరస్వతి ఇంక నోరెత్తలేదు. తన నిర్ణయాన్నే పదే పదే తలచుకొని దుఃఖాన్ని దిగమ్రింగుతోంది,

వైద్యం ప్రారంభ మైంది. ఆరోజున రెండుసార్లు ఆమెచే ఏవేవో మందులు త్రాగించారు.

# 24

ఆ రాత్రి సవ్వడి చేయకుండా మెల్లగా తలుపు తెరచుకొని బయటపడింది సరస్వతి—వీధులలో ఎలక్ట్రిక్ దీపాలు గుడ్లగూబ కళ్ళలా మెరుస్తున్నాయి. ఆకాశమంతా తల విరబోసుకొన్న పెనుభూతకిలా ఉంది. పొడవడానికివచ్చే బాకుల్లా నక్షత్రాలు మెరుస్తున్నాయి. సరస్వతివంటి హత భాగినులు ఒక వెయ్యిమంది ఆక్రందనం చేస్తున్నట్లుగా సముద్రపు హోరు అవిరామంగా చెవుల బడుతోంది. చావు దెబ్బలు తిన్న కుక్కవలె అప్పుడప్పుడు రైలుఇంజన్లు 'కుయ్యో !' అని యేడుస్తున్నాయి. అప్పుడప్పుడు ఒక లారీ పెద్దపులిలా గాండ్రిస్తూ పోతోంది. "వెయ్యి టన్నుల, ఈ హింసా భారాన్ని నేనింక ఈడ్చలేను ప్రభూ ! రా ! త్వరగా, రా ! నన్ను నీ లోకానికి తీసుకొని పో !" అని చప్పట్లు చరుస్తూ మృత్యుదేవతను ఆహ్వానిస్తున్నట్లు ఒక

గుఱ్ఱం ఖాళీబండిని లాక్కుపోతోంది. పెద్దపులిని చూచి భయపడి పారిపోయే గిత్తదూడలా మువ్వను ముఖానికి కొట్టుకొంటూ అక్కడక్కడ ఒక రిక్షా పరుగిడి పోతోంది.

బెదరినవెల్ల ఆవులా, సరస్వతి తెల్లని ముసుగుతో, నిర్జనంగాఉన్న ఆ విశాఖపట్నం రోడ్డుప్రక్కను నడచి పోతోంది. తాను వెళ్ళవలసింది సముద్రతీరానికి. మార్గ మెలాగో, తెలియదు. "ఇలా నడచి పోతూంటేసరి, చివరికి సముద్రతీరానికి చేరుకొంటాను" అనుకొంటూ కరడుకట్టిన దుఃఖంతో మసూచి వచ్చి చచ్చినదాని శవాన్ని స్మశా నానికి మోసుకొని పోతూన్నట్లు తన శరీరాన్ని వహ్యా భావంతో మోసుకొనిపోతోంది. అలా రెండుగంటలసేపు అనేక వీధులు గడచింది, వంపులు తిరిగింది. ఎంత నడచినా సముద్రతీరం కనుపించదే ! కదళీ వృక్షంలా నవ నవ లాడే ఆమె శరీరం అలసిపోయింది; చెమటతో తడిసిపోయింది. అంతులేని ఆవేదనతో, ఒడలుమరచిన ఆవేశంతో, ఎవరైనా చూస్తారేమో పలుకరిస్తారేమోనన్న బెదురుతో ఆమె తడబడుతూ తొందరగా నడచింది. అందువల్ల ఆయాస పడుతోంది. రంభా స్తంభాలవలె నున్న ఆమె తొడలు నొప్పులు పట్టాయి. దోసపళ్ళ లాంటి పిక్కలు పీకు తున్నాయి. ఎఱ్ఱ తామర పువ్వుల్లా ఉన్న పాదాలు రక్తాన్ని చిందు తూన్నట్లున్నాయి.

ఆమె తలను మఱుగుపరచి మిగిలిన ఆ శరీరావయ వాల్ని ప్రదర్శిస్తే లక్షమంది యువకులు మోహావేశపరులై

ఆమె అంగ ప్రత్యాంగాన్నీ ముద్దు పెట్టుకుంటారు ! ఆమె పాదాలమీదపడి దొర్లుతారు ! వృద్ధులు నోళ్ళుచప్పరిస్తారు ! ఆడవాళ్ళు ఈర్ష్యపడతారు ! సన్యాసం స్వీకరించిన ఎందరో స్వాములు ఆమెకు తమ శిష్యురాండ్రలో అగ్రస్థాన మిచ్చి ఆమెచే సేవలు చేయించుకొంటారు ! అటువంటి యౌవనం సౌష్ఠవం, సౌందర్యం గల శరీరం నీటి జంతువులకు ఆహారం కాబోతోంది !

ఒకచోట, రోడ్డుకి ప్రక్కగా మాసిన గడ్డంతో చింపిరి జుట్టుతో మలిన శరీరంతో, చిరిగి గాడిద చర్మంలా ఉన్న నిక్కరుతో కంచరదాడిదలాఉన్న ఒక రిక్షావాడు శివ తాండవ ముద్రతో రిక్షాలో కునుకు తీస్తున్నాడు. సరస్వతి మెల్లగా వెళ్ళి సమీపించింది. "అబ్బీ ! ఓ అబ్బీ !" అని వానిని పిలిచింది.

ఎవరైనా పిలుస్తారా, ఏదైనా కిరాయి దొరుకుతుందా, అనే తపనతో సీను వాల్చిన రిక్షావాడు సరస్వతి పిలుపుకి ఉలకిపడిలేచి— "రండి బొమ్మగారూ, ఎక్కండి!" అన్నాడు.

"బొమ్మగారూ" అన్న సంబోధనకి మెడ మెలి తిప్పుతూంటే పిట్ట కొట్టుకొన్నట్లు, సరస్వతి హృదయం కొన్ని క్షణాలు గిలగిల కొట్టుకుంది.

[illegible] "ఎక్కడానికి కాదయ్యా, సముద్ర తీరానికి వెళ్ళే త్రోవ తెలియక తిరుగుతున్నాను. దారి చూపిస్తే" అంది మెల్లగా.

"నా నిద్రంతా పాడుసేశావమ్మా ! ఈ అడ్డరోడ్డు తిన్నగా వెళ్లు !" అంటూ విసుగుతో రిక్షామీద ఒరిగాడు గార్దభావ తారంలా ఉన్న ఆ మానవుడు.

"వెళ్లు, ఇదే మార్గం" అన్నట్లుగా తీరానఉన్న విద్యుద్దీపాల కాంతులు సముద్ర తరంగాలమీదకు ప్రసరిస్తున్నాయి. నురగలు గ్రక్కే సముద్రాన్ని చూచేసరికి నెమరువేస్తూ పరుండే తమ పాడి ఆవు తలపుకి వచ్చింది సరస్వతి. కన్నబిడ్డను కౌగలించుకోడానికై చూచే తల్లి చేతుల్లా తరంగాలు వేస్తున్నాయి. చల్లనిగాలి 'రా, నాతో పరుగెత్తు' అని పిలుస్తూన్నట్లు ఆమెను రాసుకొంటూ ఒరసుకొంటూ పోతోంది.

నీటిని సమీపించి సరస్వతి ఒక దీర్ఘమైన నిట్టూర్పు నిగిడ్చింది. దానితో ఆమెలోనున్న నర నరమూ బిర్ర బిగిసింది. దృఢ నిశ్చయంతో ఆమె ముఖం గంభీరమైంది. పమిటకొంగును గట్టిగా నడుముకి చుట్టబెట్టింది. మృదువైన ఆమె వక్షము పొంగి, బిరుసెక్కి గడ్డకట్టిన మంచు దిబ్బలా ఉంది.

వచ్చే తరంగం పొమ్మంటూన్నట్లు వెనక్కి నెంటుతోంది. పోయే తరంగం 'రామ్మా, రా నాతో' అన్నట్లు లోపలికి తోసుకొని పోతోంది. ఎదిరించే కెరటాలతో పెనగులాడి వాటిని తోసుకొని అంబుధి హృదయంలోకి చొచ్చుకొని పోయింది సరస్వతి,

లోకం హృదయం చల్లబడింది. వంశప్రతిష్ఠను కాపాడుకోటం కోసం, కుల మర్యాదల్ని నిలుపుకోటం కోసం, తమ ముద్దుల కూతుళ్ళనీ చెల్లెళ్ళనీ సమాజానికి బలి చేసిన పరంపరానుగత సాంప్రదాయ సేవా పరతంత్రులైన పండిత ప్రకాండుల కీర్తిని గానం చేయ సాగాయి పక్షులు ! "అమ్మయ్య, ఇంక బాధలేదు. తలెత్తుకొని తిరగవచ్చు" అని తోచి కాకోలు, మన ఆధునిక సామాజ సభ్యులు ఒక్కరొక్కరే బయట పడుతున్నారు. గర్భవతియైన విధవను తానుకూడ భరించలేక సముద్రం సరస్వతిని మళ్ళీ భూమి మీదకు నెట్టివేసింది. సరస్వతి కళేబరం రక్తపు మరకలతో నున్న గుడ్డతో తీరాన పడివుంది !

